ఓమ్.

శ్రీ నమో రామదూతాయ.

శ్రీ

# తెలుఁగు పోటీపరీక్షావ్యాసములు.

పోటీదారుఁడు

శ్రీభ్రమరాంబా మల్లేశ్వరస్వామి సమాజమువారి ప్రత్యేక బహుమానమును, ఆంధ్రక్రైస్తవ కళాశాలా పత్రికా బహుమానమును, కీ. శే. ముత్తరాజు శివకామయ్యపంతులుగారి స్మృతి బహుమానమును, కేసరీ స్వర్ణపతకమును, బడసినవాఁడును, విద్యావిషయక గ్రంథకర్తయును, నగు

మహావాది వేంకటరత్న కవికుమారుఁడు,

తెనుఁగు శాఖోద్యోగి, ఆంధ్రక్రైస్తవకళాశాల, గుంటూరు.

౧౯౩౦

మూల్యము ౧-౮-౦

# విషయసూచిక.



యంత్రము—ద్రౌపదీమానభంగము — దానపర్వతము —రాజభక్తి—మాతృప్రేమ—భ్రాతృప్రేమ—బంధుప్రేమ—అభిమన్యునివధ—శల్యసారథ్యము—కర్ణార్జునుల యాధిక్యము.

## ౪. ద్రౌపది గుణశీలములు.

## The Career And Character Of Droupadi.

1. భారతభూమి. 2. జనాభిప్రాయము. 3. గుణశీల విభేదము—4. గుణనిర్ణయము—దయాసత్యశౌచధర్మగుణంబులు. 5. శీలనిరూపణము. ద్రౌపది—పతివ్రతా ధర్మములు—కులకాంతా లక్షణములు—కార్యేషు దాసీ—కరణేషుమంత్రీ—రూపేచలక్ష్మీ—క్షమయాధరిత్రీ—భోజ్యేషు మాతా—శయనేషురంభా.— 6. ఋషులవ్యాకములు సాధకములు—ద్రౌపదియొక్క పరిచారిక—ద్రౌపది నిక్కమగు గృహిణి—ద్రౌపది సేవాధర్మజ్ఞ—ద్రౌపది పతివ్రతాధర్మజ్ఞ—ద్రౌపది సుక్షత్రియకాంత—ద్రౌపది రాజధర్మజ్ఞ—ద్రౌపది శ్రీకృష్ణ సంస్తుతాలు—ఉపసంహారము.



# సహాయ గ్రంథములు.

సంస్కృతము. ఆంధ్రము. ఆంగ్లము. హిందీ.

౧. శ్రుతులు.
౨. తైత్తిరీయోపనిషత్తు.
3. కఠోపనిషత్తు
౪. ముండకోపనిషత్తు.
౫. భగవద్గీత.
౬. సంస్కృత భాగవతము.
౭. ద్రవిడ పురాణము.
౮. సంధ్యావందనము.
౯. భారవి.
౧౦. భర్తృహరి.
౧౧. శ్రీకృష్ణకర్ణామృతము.
౧౨. శివానందలహరి.
౧౩. అధ్యాత్మరామాయణము.
౧౪. నీతిశాస్త్రము.
౧౫. నారదభక్తి సూత్రములు.
౧౬. అధర్వణకారికలు.

* * * *

౧౭. శ్రీమదాంధ్ర మహాభారతము.
౧౮. శ్రీకృష్ణభారతము.
౧౯. శ్రీమదాంధ్రమహాభాగవతము.
౨౦. భాస్కరరామాయణము.

౨౧. విష్ణుచిత్తీయము.
౨౨. పాండురంగ మాహాత్మ్యము.
౨౩. కాళహస్తి మాహాత్మ్యము.
౨౪. ద్రౌపదీ పరిణయము.
౨౫. విజయవిలాసము.
౨౬. శివతత్త్వసారము.
౨౭. తిరుపతి వేంకటకవులు.
౨౮. ఆంధ్రభాషాభూషణము.
౨౯. బాలవ్యాకరణము.
౩౦. కొణిదెనశాసనము.
౩౧. యుద్ధమల్లుని శాసనము.
౩౨. తత్త్వదీపిక.
౩౩. ఇతర గ్రంథములు.
౩౪. జలాలుద్దీను—ఆంధ్రానువాదము.

*　　*　　*　　*

35. Bhagavadgeeta.
36. Tiaettireeyopanishat.
37. The Speeches of Vivekananda.
38. The Speeches of Chaitanya.
39. The Soul of India.

*　　*　　*　　*

౪౦. తులసీదాస రామాయణము.



MR. T. VENKATARATNAM, M. A., L. T.

To

My Beloved Lecturer.

Mr. T. Venkataratnam, M.A.,L.T.,

Tel. Lecturer, A. C. College, Guntur.

This Book Is Dedicated

As A Token Of

My

Studentship And Reverence.

# A WORD.

IT gives me pleasure to write just a few lines about the work of Mr. M. Venkataratnam who is now serving as one of our tutors in Telugu in this college. Mr. Venkataratnam was a student of the college for the past four years and did good work in all of his classes and in all of his subjects but he always showed a very special aptitude for Telugu and was far above the average of the students in his accomplishments in his mother tongue.

It may be noted that much of the work included in this book represents essays prepared by Mr. Venkataratnam in connection with competitions. The first essay for which he received a special prize, was published in the Andhra Christian College Magazine and received high commendation from many men of great prominence. The second essay was written especially for our College Magazine and he secured for it the prize that is awarded each year for the best Telugu Essay prepared for the Magazine. The third essay secured first prize in a competition arranged by the Teachers' Association of the Hindu High School, Intur, in memory of the late

Mr. M. Sivakamaiah, B. A., L. T. The fourth essay was written for the competition arranged by the Nellore Progressive Union Committee and secured the first prize. The essay was published in "GRIHA LAKSHMI".

I feel that Mr. Venkataratnam is to be highly commended by all who are interested in Telugu literature for the work which he has been able to turn out even as a young man. I wish him all success and venture to express the hope that this little book of essays my be well received.

Guntur,
6th Sep. 1930.

**Sd. J. ROY STROCK, M.A., D.D.,**
**Principal,**
**Andhra Christian College,**



# అభిప్రాయములు.



చిరంజీవి మహావాది వేంకటరత్నమునకు—

ప్రమోదూత శ్రావణ బ ౧౩ శుక్రవారము—

మిత్రమా!

ఆశీర్వచనములు. నీవు అభిప్రాయంకోసం యిచ్చిన 'తెలుగు పోటీపరీక్షావ్యాసములు' సమగ్రంగా చదివినా. నీశైలి ధారాళంగానూ, నిర్దుష్టంగానూ, అందఱికీ తెలిసేటట్టు సులభంగానూ, ఉంది. నీవిమర్శజ్ఞానానికి 'కర్ణార్జునుల ధర్మాధిక్యనిర్ణయమూ' 'ద్రౌపదిగుణశీలములూ' సాక్ష్యమంటానికి సందేహం లేదు. వ్యాకరణము—భాషకుగల సంబంధం బాగానే వివరించి రాశావు కాని భాషాచరిత్రం ప్రత్యేకం పఠించేవాళ్ళకు, నిఘంటువులు రచించుకొనేవాళ్ళకూ తప్ప సారస్వతరసపిపాసులకు వ్యాకరణములు కేవలమూ అనవసరం. ఒకవిధంగా ఆటంకంకూడాను. భాషాపరిచయ వైపుణ్యములోనే వ్యాకరణాలు ఇమిడి పోతయి. నీభక్తిమార్గం తాన్ననుసంధించిన వేదాంతం ఆ మొదటి పుటలోని భక్తివంశచరిత్రం చూపేపటం నాకు బోధపడలేదు; బహుశా నేను భక్తుణ్ణి కానుగనుక నేమో?

నీవు వృద్ధికాముడవు. నాకన్న కుఱ్ఱవాడివి. కనుక చిన్న సలహాయిస్తా. వాడుకభాషలో వ్రాయి. నీమనస్సందుకు ఒప్పుకోదంటావూ నీగ్రాంథికభాషలోనే సజీవంగా, ఆకర్షకంగా, స్వాభావికంగా, శైలి నడిపించు. విరుపులతో, పొడిపొడిగా, మెలికలు మెలికలుగా, పలుకుబడిని కూర్చకుండా, కొట్టవచ్చినట్లు, అయినా నొచ్చుకోనట్లు, హాస్యం అక్కడక్కడ కనిపించేటట్లు, ముక్కుకు సూటిగా, చెప్ప దలచుకొన్నది తికమకలు లేకుండా, చదివేవాళ్ళబుఱ్ఱకు ఎక్కేటట్లుగా, గద్య నడిపించమని చెప్పాతున్నా. ఇంతదూరం ఎందుకన్నానంటే, ఏదో ఒక సంవత్సరంపాటు, నీకూ నాకూ ఆంగ్లసాంప్రదాయాల ప్రకారం గురుశిష్య సంబంధం కాస్త యేర్పడింది గనుక. ఇట్లాంటి పుస్తకాలు చాలా వ్రాస్తూ పేరు తెచ్చుకోమని దీవిస్తా. అట్లా నిన్ను శక్తిమంతుణ్ణి చెయ్యమని భగవంతుణ్ణి ప్రార్థిస్తా. ఇంతకూ నీవు తెచ్చుకొన్న బహుమానాలే నీవ్యాసాల గుణమును వెల్లడిస్తూవుంటే యితరుల అభిప్రాయంతో నీకు పనేమిటి? అయినా నీవడిగినావు గనుక కాదనలేకపోయినా.

ఇట్లు,

నీవు వృద్ధిని పొందవలెనని ఎల్లప్పుడు అనుకొనే మిత్రుడు,

కొడాలి వేంకట సుబ్బారావు, బి. ఏ.,

(హిస్టరీ & తెలుగు) ఆంధ్రోపన్యాసకుడు,

ఆంధ్రక్రైస్తవ కళాశాల, గుంటూరు.

---

శ్రీమతే రామానుజాయనమః.

ఈవ్యాసములన్నియు నిదివఱకే సహృదయుల విమర్శలకులోనై బహుమతుల నందియున్నవి. ఈవ్యాసములన్నియు గ్రంథకర్త విద్యార్థి దశలో నున్నపుడు వ్రాసినవి. విషయము లచ్చటచ్చట వికల్పసహములు కాకపోయినను శైలి నిర్దుష్టమై ధారాళముగ నున్నది. భావములు విస్పష్టమగు భాషలోఁ బొదుగఁబడినవి. వ్యాసరచనాభ్యాసమునకై పాటుపడు విద్యార్థుల కివి యమూల్యములు. బాలకవియు వృద్ధికాముఁడు నగు నీగ్రంథకర్త సర్వవిధములఁ బ్రోత్సహింపఁదగినవాఁడు.

అగ్రహారం,
1—9—1930.

కె. జి. కృష్ణమాచార్యులు,
ఆంధ్రోపన్యాసకుఁడు,
ఆంధ్రక్రైస్తవకళాశాల, గుంటూరు.

చిరంజీవి మహావాది వేంకటరత్నమునకు—

భక్తిపూర్వకముగా నీవంపిన పుస్తకము నామము నరసి వ్యాసముల నందందుఁ జదివితిని. శైలిసుగమము. సరసము. విషయవిభజనము ప్రశస్యము. భాష నిర్దుష్టమనవచ్చును. (కూర్చొనఁగలఁడా? 92 పేజి. ప్రమాదపతితము.)

పరీక్షాధికారుల నియమముల ననుసరించుటకుఁ గావలయు విషయము సమగ్రముగా విస్తరింపం బడలేదు.

ద్రౌపది గుణశీల నిరూపణంబున విరాటు నగరమందలి సైరంధ్రిని, సైంధవుని మందలించు ద్రౌపదిని స్మరింప కుంట పాడిగాదు.

ఈ వెండ్రుకలు పట్టి యీడ్చిన యాచేయి తొలుతగాఁ బోరిలో మున్న సేను తను వింతలింతలు తునియలై చెదరి చూపఁగ యున్నఁగని యుడుకాఱుఁగాక! యలుపాలఁ బొనుపఁనట్టి చిచ్చేయిది ?...............

అని తన భంగపాట్లు కృష్ణునితోఁ జెప్పుకొను సం దర్భమునందలి పద్యముల వివరించినంగాని,

.........ద్రోణ కుటుంబిని.......ఎంతపొక్కునో.......
అతి పాపము—బ్రాహ్మణహింస మానరే— 136 పేజి.

అను ద్రౌపది భావములు వన్నెకెక్కవు. పతివ్రతలు పుత్త్రశోకమునైన సహింతురుగాని మానభంగావమాన మును సహింపనేరరనునదియే వక్తవ్యాశంము. మండ తిలోప ముల్......(168 పేజి.) అను శ్రీకృష్ణభారత పద్యముంగాక తిక్కన పద్యములనే కైకొన్న సమంజసముగా నుండెడిది.

భాష-వ్యాకరణము—అను వ్యాసములోని కొన్ని విష యములు విమర్శనీయములై యున్నయవి.

భక్తి-వ్యాసము సరసముగా నున్నది. "నారదభక్తి సూత్రములు" మొదలైన వానిం గ్రహించి "సూక్ష్మములో మోక్షముం" జూపుట యుక్తముగనే యున్నది. కర్ణార్జునుల యాధిక్య నిర్ణయముగూడ "ఊరిపెండ్లి సుబ్బి చావునకుం గారణమైనది" (100 పే.) మొదలగు లోకోక్తులతోం దులందూంగుచు నొప్పారుచున్నది. విస్తర భయంబునం గాంబోలు నర్జునుని పరాక్రమ గాథలు, కర్ణుని దండయాత్రాదులు పరిత్యక్తము లైనవి.

చదువుకొనుకాలమున నొక విద్యార్థి యిట్టి సవిమర్శక వ్యాసముల వ్రాయుట మెన్నందగిన విషయముగాక మఱేమి? భాషాభిమాను లీ గ్రంథము నాదరించెదరుగాక!

గుంటూరు,
26—8—30.

ఉభయభాషాప్రవీణ
మిన్నికంటి గురునాథశర్మ,
ఆంధ్రపండితుండు, టవున్ హైస్కూలు,

# Competitor's Word.

*My Beloved Readers!*

MY scholarship is indeed very poor. Moreover I am not a specialist in any branch of our Telugu Literature. Yet inspite of my literary poverty, I had

the courage to compete with the learned scholars as a result of which I got all the first prizes but one in all these competitions. Certainly it is a laborious task to write any literary article. I patiently laboured for many a day for the completion of every one of these essays. The list of the consulting books, given here, is undoubtedly a better proof for my hard labour. Yet I confess my inability to dive deep into the inmost parts of our Literary Ocean so as to pick out the hidden purest gems that still brighten the subjects of these essays. However, I believe that these essays may have their place in Telugu Literature though not as literary works, Yet at least as a sort of prose compositions.

I give my thanks to my Principal who said 'A WORD' regarding these essays, to my lecturers who gave their opinions, to Mr. P. Varadarama-Krishnaiah, M. A., who introduced my essays to the Public and to Mr. T. Venkataratnam Pantulu. M.A., L. T., who consented for my dedication. I request my readers to go through all these essays and to correct me, if necessary, kindly and impartially.

Guntur,
12th Sep. 1930

Competitor,
M. V. R. KAVIKUMAR.

# పరిచయము





చిరంజీవి శ్రేయోభిలాషియైన మహావాది వేంకటరత్నకవికుమారుఁ డాంధ్రభాషామతల్లికిఁ దన శక్తికొలఁది సేవయొనర్చుచు గుణగ్రహణపారీణులైన కోవిదవర్యుల యాశీర్వచనములకుఁ బాత్రుఁ డగుచున్నాఁడు. పట్టపరీక్షకై యాంధ్ర క్రైస్తవ కళాశాలయందు విద్యాభ్యాస మొనరించుసమయంబున నస్మదంతేవాసియు నగుటంజేసి వేఱొండు వల్కక తత్కృతవ్యాస చతుష్టయమును విమర్శించి గుణదోషముల రూపింపఁ బ్రయత్నించెదను. మునుముం దాంధ్రవాఙ్మయమునందలి గద్యరచనను గుఱించి యించుకంత విచారణ సేయవలసియున్నది.

కవిశేఖరుండును లక్షణవేత్తయునైన కేతనామాత్యుఁడు గూడ నాంధ్రము సంస్కృతభవమని వ్రాసియున్నాఁడు. ఆంధ్ర కవులెల్లరు గీర్వాణపండితులై సంస్కృతకవులకు జోహారు లొనర్చి వారి మార్గముల ననుసరించియున్నారు. గీర్వాణ వాఙ్మయసముద్రమునందు గద్యరచన మిక్కిలి తక్కువ.

కావుననే గద్యరచనార్హములైన ధర్మశాస్త్ర వైద్యశాస్త్ర గ్రంథములు పద్యమునందు రచింపఁబడినవి. రాజమహేంద్ర వరపురాధీశ్వరుఁడైన రాజనరేంద్రుని యాస్థానవిద్వాంసుఁడు నన్నయభట్టు ప్రభుని యానతి ననుసరించి మహాభారతమును దెనిఁగించెను. తిక్కయజ్వ, ఎఱ్ఱాప్రెగడ భారతాంధ్రీకరణమును సమాప్తినొందించిరి. సంస్కృతపురాణముల నాంధ్రీకరించు కవిత్రయమువారు గద్యమునకుఁ బ్రాముఖ్యమొసంగలేదు. శ్రీనాథుఁడు, బమ్మెర పోతరాజు, పై మార్గమునే యనుసరించిరి.

ఆంధ్ర భోజుండగు శ్రీకృష్ణరాయల సంస్థాన విద్వత్కవి శిఖామణులగు పెద్దనార్యుఁడు, తిమ్మనామాత్యుఁడు మొదలగు వారి కృతులయందును గద్యమునకుఁ దావులేదు. అచ్చటచ్చటఁ జరిత్రాదులందుఁ గానవగు వచనములు గద్యరచనకుఁ దోడ్పడునవిగావు. పద్యరచనయందు వారిదృష్టి లగ్నమైనట్లు గద్యరచనయందుఁ గాలేదు.

గత శతాబ్దమున సూరివర్యుఁడు చిన్నయసూరి బాల వ్యాకరణము, అను నాంధ్ర వ్యాకరణ మొకదానిని వ్రాయుటయేగాక గద్యకావ్యములఁగూడ వ్రాసెను. కాని యతఁడు విద్వజ్జనామోదము గలిగింపఁదలంచి గద్యరచనకుఁ గడంగెను. సామాన్య భాషాజ్ఞానము గలవార లాగ్రంథముల దరికిఁ

జేరఁ జాలరు. ఇంతకు సారాంశమేమన జనసామాన్యమున కర్థముగావలెననెడి యూహతో వ్రాయఁబడిన గద్యగ్రంథము లాంధ్ర భాషయందు లేవన వచ్చును.

ఇట్టితఱి విద్వద్వర్యుఁడును, మతసాంఘిక విషయములఁ బరివర్తనము గలుగఁజేయనెంచి తన యావచ్ఛక్తిని వినియోగించిన మహనీయమూర్తియు, నైన శ్రీవీరేశలింగము పంతులుగారు గద్యపద్యాత్మక గ్రంథములు వ్రాయఁదొడంగిరి. వీరి వివేకదీపిక, ఆంధ్రగద్యరచనకుఁ జేయూత యొసంగినది. సాంఘికదోషముల నిర్మూల మొనర్పవలె ననెడి యూహ గలవారగుటచే శ్రీపంతులుగారు జనసామాన్యమున కర్థమగు శైలిని స్వీకరించిరి. చిన్నయసూరి శైలియు వీరి సంధివిగ్రహమునందుఁ గానవగును. ఆంధ్రగద్యము వీరి చేతిలో సాంఘిక దోషముల రూపుమాపు నాయుధముగ నుండెను. ఆంధ్రుల హృదయసీమలందు వీరి గ్రంథములఁ జదువవలె ననెడి యుత్సాహ మంకురించెను.

తరువాతఁ జిలకమర్తి లక్ష్మీనరసింహము పంతులుగా రాంధ్రగద్యమునకు వన్నె యొసంగిరి. వీరి నవలలు నాటకములు సులభశైలిలో వ్రాయఁబడి యున్నవి. కర్పూరమంజరి, హేమలత, అహల్యాబాయి మొదలగు వీరి కృతు లాంధ్రలోకమున విశేషవ్యాప్తిఁ జెందియున్నవి. శ్రీ పాన

గంటివారి సాక్షినిగుఱించి యెక్కువగా వ్రాయనక్కఱలేదు. సందర్భము ననుసరించి శబ్దజాలము నుపయోగించుట యందును, రసవార్థిని శ్రోతల నోలలాడించుటయందును నరసింహముగారి నాంధ్రగద్య కవులలో మించినవారు లేరనవచ్చును. సాక్షియందలి గద్యరచన మిక్కిలి సంతోషము గలిగించును.

ఆంధ్రగద్యరచనాభివృద్ధికి 'ఆంధ్రపత్రిక' 'కృష్ణాపత్రిక' ఎక్కువగాఁ దోడ్పడినవి. ఈ పత్రికలఁ జదువుటవలననే యాంధ్రులలో నూతనోత్సాహము బయలుదేరినది. ఆంధ్ర గద్యరచనకు విజ్ఞానచంద్రికాగ్రంథమండలి యొనర్చిన సేవ ప్రశంసార్హము. ఇట్లు గతశతాబ్దిమధ్యభాగమునుండి యాంధ్ర గద్యరచన వృద్ధిలోనికి వచ్చుచున్నది. ఆంధ్రభాషాభిమానులు, ఆంధ్రగద్యకవులు ననేకవిధముల నాంధ్రగద్యరచనకుఁ దోడ్పడుచున్న సంగతి యెల్లరకు విశదమే. వారి పవిత్రనామముల నిచ్చటఁ బేర్కొనఁజాలనందుకు మన్నింపవేడెద. దైవానుగ్రహమువలన వేంకటరత్నకవికుమారుఁ డాంధ్రభాషకు సేవ యొనర్చునని విశ్వసించుటకు సావకాశముగలదు. ప్రస్తుత మితని గద్యరచనాసామర్థ్యమునుగూర్చియు, గద్యరచనావిధానమునుగూర్చియు విమర్శింతము.

ఇతని శైలి నిర్దుష్టమై పాఠకుల హృదయముల రంజింపఁ జేయును. రసోద్రేకమునుబట్టి, యితని శైలియు మారు

చుండును. ఏచోట నేవిధముగా రచనా సౌష్ఠవమును జూప వలసినదియు, మన కవికుమారునకుఁ జక్కఁగాఁ దెలియును. విమర్శించు నప్పు డితని శైలి కొట్టవచ్చి నట్లుండును. అదిగాక గ్రంథ పరిచయము, విషయవిమర్శనా నైపుణ్యము, విషయ విభాగ వైశారద్యము, విమర్శకున కుండునట్టి స్వాతంత్ర్యము, మున్నగు లక్షణంబు లితని వ్యాసములందుఁ గన్పట్టుచున్నవి. ఇంక వ్యాసమునందు విషయ విభాగము సక్రమముగా నుండి కవి చెప్పఁదలఁచిన సారాంశములు పాఠకులకు సులభముగాఁ దెలియు నట్లుండ వలెను. శైలి హృదయరంజకముగా నుండి యర్థము ననుసరించి శబ్దములు ప్రయోగింపఁబడుచుండవలెను. వాక్యములు కొన్ని దీర్ఘములుగను, కొన్ని హ్రస్వములుగను నుండి వ్యాసమునకు సొగసు నొసంగవలెను. అవసరమగు చోట్ల హాస్యరసము మొదలగు రసములకుఁ దావొసంగవలెను. ఈ లక్షణంబు లన్నియు నీవ్యాసములందు నిర్దుష్టముగాఁ గలవు.

భక్తిమార్గము—

'భక్తిమార్గము' అను వ్యాసమునందు భక్తిని గురించి విపులముగాఁ జర్చింపఁ బడినది. తామసరాజస సాత్త్వికభక్తి లక్షణములు వివరింపఁ బడినవి. ఈశ్వరసాయుజ్య ప్రాప్తికి భిన్న మార్గములు గలవు. 'సాత్త్వికకర్మజ్ఞాన యోగేభ్యో...

ప్యధికతరా’ అను నారదసూత్రముననుసరించి ‘భక్తిమార్గము సర్వోత్తమ మగుచున్నది’ అని కవి యభిప్రాయము.

శ్రవణం, కీర్తనం, విష్ణోస్స్మరణం పాదసేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్యం చాత్మనివేదనం.

అను తొమ్మిది మార్గములు సూచింపఁబడినవి. ఇచ్చటఁ గవి భక్తియందలి తొమ్మిదిమార్గములను గుఱించి విపులముగా వ్రాసి యేమార్గము ననుసరించి యేభక్తుఁడు తరించెనో వ్రాసిన బాగుండి యుండును. భక్తలక్షణముల బాగుగ నిరూపించియున్నాఁడు. ఈశ్వరుఁడను నొకేలక్ష్యమునఁ దమచిత్తంబుల లగ్నమొనర్చి యుపాసించువారలే భక్తులలో ముఖ్యులని తెలుపంబడియున్నది. భక్తుఁడు తాను తరించుటయేగాక లోకులఁ దరింపఁ జేయఁగలఁడని రుక్మాంగదుని నుదాహరణముగాఁ గొని నిరూపించియున్నాఁడు. భక్తిప్రభావము వివరింపఁబడి యున్నది. భక్తియను విషయ మపారమైనది. ఎంతవ్రాసినను గొఱఁత గనుపించుచుండును. కాని వ్రాసిన విషయము సమంజసముగా నున్నది లేనిది విచారించుట విమర్శకుని విధి. ఈవ్యాసమునందు విషయవిభాగము బాగుగ నున్నది. అన్నిమార్గములలోను భక్తి యుత్తమమైనది యను సారాంశము స్పష్టముగా వ్రాయఁబడినది. ఈ[illegible] వాక్యమున భక్తుఁడు సంఘమర్యాదలను శాస్త్రసాం[illegible]

దాయములను ననుసరింపవలయునా లేదా యను మీమాం
సను సహేతుకముగఁ బరిష్కరించి కవి సదభిప్రాయమొసంగి
యున్నాఁడు.

కర్ణార్జునుల యాధిక్యనిర్ణయము—

'కర్ణార్జునుల యాధిక్య నిర్ణయము' అను వ్యాసమును శ్రద్ధతో విమర్శింపవలెను. లోకమునందు కర్ణుఁడు దుర్మార్గుఁడనియు వాసవాత్మజునితో పని సేయఁజాలనివాఁడనియు నొక యభిప్రాయముగలదు. దానరాధేయుండని పేరుసెందిన సంగ్రామ రంగంబుల భీకరారినికరంబులఁ గసత్కనకగదా చాపాద్యాయుధ విశేషంబులఁ జెండాడి జయలక్ష్మిని వరించిన భానుపుత్రుం డలఘుండనియు నింద్రసూతికి లొంగువాఁడుకాఁడనియు నిరూపించుటకే యీ వ్యాసము వ్రాయఁబడినది. చతుస్సముద్రముద్రిత భూవలయంబునంగల క్షత్రియ వర్గంబుల నెల్ల నోడించి కప్పంబులఁ గైకొని రాజరాజుచేత విష్ణు యాగంబు సేయించిన వీరపుంగవుఁడు రాధేయుండు సామాన్యుండే?

కర్ణుని సద్గుణములన్నియు మిక్కిలి నేర్పుతో వర్ణింపఁబడినవి. శాపోపహతుఁడు గానిచో సూతపుత్రుఁ డర్జునునకుఁ జాలిన వీరుఁడని వ్యాసమునందు వర్ణింపఁబడినది. రాజభక్తి, మాతృప్రేమ మొదలగు సుగుణములు కర్ణునందే యొ...

వగాఁ గన్పడును. కురుపక్షమును వీడి పాండవేయులఁ జేరుమని శ్రీకృష్ణపరమాత్మ చెప్పినపుడు కర్ణుఁడొసంగిన ప్రత్యుత్తరము రాధేయుని రాజభక్తిని సూచించుచున్నది. ద్రౌపదీ పరాభవకాలమునందు సూతాత్మజుని ప్రవర్తన యాతని కీర్తిచంద్రికకుఁ గళంకమును నాపాదింపఁ జేయుచున్నది. ఈ విషయమునఁ గవి సమర్థనము చమత్కారముగాఁ గనుపించును. ఉత్తరగోగ్రహణమందును, గంధర్వులతోడి కయ్యమునందును రాధేయుని పరాక్రమ మేమయ్యెనో కవి ముచ్చటింపఁడు. తపోబలంబువలనను, గురుని యనుగ్రహంబు వలనను, శ్వేతవాహనునికున్న యస్త్రసంపత్తి గర్ణునకు లేదు. కురుక్షేత్రసంగ్రామమున నింద్రసూనుఁడు గర్ణునితో నని సేయ జంకి తనరథమును వెనుకకు మరలించుకొనెను. మత్స్యయంత్ర సందర్భమునఁ గర్ణపరాక్రమున కిసుమంతయు లోపములేదు. కర్ణుఁడు బాణసంధానమును జేయలేదు. లక్ష్యము దప్పలేదు. అభిమన్యుని వధ గర్ణునకుఁగూడ నపఖ్యాతిని సమకూర్చుచున్నది. కర్ణుని సంహరించినపుడు రాజధర్మము వీడెనని యర్జునునియందు నేరము మోపఁబడినది. ఇట్టి నేరము కర్ణునందును గలదు.

వ్యాసమును గవి గర్ణపక్షము వహించి వ్రాసినాఁడు. కర్ణపాత్రమును గడు సమర్థతతోఁ బోషించినాఁడు.

## భాష—వ్యాకరణము.

ఈ వ్యాసమునందు విషయము స్పష్టముగఁ జర్చింపఁ బడినది. వ్యాకరణచరనా విధానమును గూర్చి కవి సమగ్ర ముగా విచారించినాఁడు. ఆంధ్రభాషకంతకును సరిపడు వ్యాక రణములు లేవని సదృష్టాంతముగ నిరూపింపఁ బడినది. 'జీద్భాషలు కాలక్రమమున ననుసరించి మారుచుండును. మారు టయే వీనికి ముఖ్యమగు లక్షణము. ఆ మార్పులకుఁ గూడ లక్షణముల గల్పింపవలయును గాని లక్షణ విరుద్ధములని యెంతమాత్రమును వానిఁద్రోసి వేయరాదు.' పైవాక్యములు యథార్థములు. భాషాసాంప్రదాయముల ననుసరించి లక్షణ ములు వ్రాయఁబడును. అట్టి లక్షణములకుఁ గవుల గ్రంథ ములనుండి లక్ష్యములు సూపఁబడును. కనుక వ్యాకరణ మెప్పుడు భాష ననుసరించి యుండును. కొంతవఱకు క్షుద్ర కవుల చేతిలోఁబడి చెడకుండ వ్యాకరణము భాషనుగాపాడును. అంతియేగాని భాషాభివృద్ధికి వ్యాకరణము ప్రతిబంధకముగా నుండరాదు.

కవిత్రయమువారి రచనలే ప్రమాణములు—మిగిలినవి యప్రా మాణము లనుకొనుట న్యాయ విరుద్ధము. చిన్నయసూరి వ్యాకరణమునకు సరిపడని ప్రయోగము లసాధువులనుకొనుట

మూఢ విశ్వాసము. పై వ్యాకరణ సూత్రములకు విరుద్ధము లైన ప్రయోగములను భారతమునుండి చూపవచ్చును. భాష వృద్ధియగు నప్పుడు వ్యాకరణము దాని ననుసరించి సవరింపఁ బడవలయును. ఈ వ్యాసమును గవి గడుశ్రద్ధతో సమర్థతతో వ్రాసియున్నాఁడు.

ద్రౌపది గుణశీలములు.

ఆంధ్రసోదర సోదరీ మణులెల్లరు నీ వ్యాసమును జదివి తీరవలయునని నామనవి. సప్రమాణముగ ద్రౌపది గుణ శీలముల నిరూపించి యామె పాతివ్రత్యమును గవి నిర్ణయించి యున్నాఁడు. ఏవురు భర్తలుగల స్త్రీ పతివ్రతయగునా? యను సందేహమును నిర్మూలించినాఁడు. ఈ వ్యాసమునందలి శైలి చక్కగ గంభీరముగ నున్నది. సందర్భము ననుసరించి రసోద్రేక పూరితమై యొప్పారుచున్నయది. విషయవిభాగ మత్యద్భుతముగాఁ జేయఁబడినది.

'కరణేషు మంత్రీ'

బలదర్పితుండై కామాంధుండైన సింహబలుని యమ క్షయమున కంప భీమసేనుఁ బురికొల్పి యజ్ఞాతవాస నియమ భంగముగాకుండ మెలంగుమని వాయు పుత్రునకు హి[illegible] దేశ మొనర్చి తన శేముషీ విశేషమును ద్రుపదాత్మజ [illegible]

టించి యున్నది. ద్రౌపదియందుఁగల గుణము లన్నియు నీవ్యాసమునందు నిరూపింపఁ బడియున్నవి.

భారతదేశమందు జన్మించి తమ యశశ్చంద్రికల దేశ మందంతట వ్యాపింపఁజేసి యుత్తమ పతివ్రతలని వన్నెకెక్కిన సీత సావిత్రి మొదలగువారి పవిత్రనామములతోఁబాటు ప్రతి దినము పాపక్షయార్థమై ద్రౌపదీదేవియొక్క నామముగూడ నుచ్చరింపఁబడుట మనమెఱింగిన విషయమే. ఆంధ్రనారీమణు లెల్లపుడు నీమె నామమును స్మరింపనగును.

ఆంధ్రలోకమునకు మాబాలకవి తన వ్యాస చతుష్టయ మును సమర్పించి యాంధ్రభాషకు సేవఁజేయఁ బ్రయత్నించి నాఁడు. ‘బాలాదపి సుభాషిత’ మను న్యాయ మనుసరించి విద్వద్వర్యులు గుణగ్రహణ మొనర్చి లోపము లున్నచో మన్నించి యాతని నాశీర్వదించెదరుగాక!

ఇట్లు విధేయుడు,

గుంటూరు, 16—8—30, } పుచ్చా వరదరామకృష్ణయ్య, యం. ఏ., ఆంధ్రోపన్యాసకుఁడు, ఆంధ్ర క్రైస్తవ కళాశాల,



బచ్చిమాంసాహారంబున జీవించుటయు, సంభవించుటం జేసి, సంఘమున శాంత్యైకమత్య నిరోధములు దటస్థించి నవి. అప్పుడు క్రూరమానవ సంహారిణియగు మహాకాళి మానవ ప్రపంచముపైఁ జెలరేగినది. క్రూరమానవ ప్రాణాపహరణంబువలన సత్వరిఁ గొంతవఱకు సంఘసంస్కరణము జరిగినది. కాని యప్పటికి నైకమత్యనిరోధము సంఘమునఁ బ్రజ్వరిల్లుచునే యున్నది. శాంత్యైకమత్యములు సంఘమున నిలువకున్నఁ గర్మప్రపంచము నశించునుగదా? కావుననే తత్ప్రతిష్ఠాపనంబునకై పదికరములు బాల్చి పర్జ్య యవతారమెత్తి తన పదికరము లెట్లుగలసియున్నవో యట్లే సంఘమంతయు నేకీభావము వహించి శాంతి పరిపాలనా ఛత్రంబు మాటున సుఖజీవన మొనర్పవలయునని సూచించుటయే గాక, తత్కృత్యమును గూడ నిర్వహించినది. ఇప్పటికి శక్తి ప్రపంచమునుండి నిజముగ శాంత్యైకమత్య సమ్మిళిత సర్వమానవ ప్రపంచము సృజియింపఁబడినది. ఈ శక్తిత్రయ శ్రేయోరూపము—— (అనఁగాఁ బరబ్రహ్మ స్వరూపము)

అత్యసృజత క్షత్రం, యాన్యేతాని దేవతాక్షత్రాణి
ఇన్ద్రో, వరుణః, సోమో, రుద్రః పర్జన్యో
యమో, మృత్యు, రీశాన ఇతి.

వీరందఱును సకలమానవ రక్షణాభివృద్ధిక్షయములకు మూలకారణములైన వారలు. ఇప్పటికి మానవప్రపంచసృష్టి సర్వము సంపూర్తినొందినది.

శక్తి ప్రపంచము ముగిసినది. అందుండి సర్వవస్తు సంభరిత సౌఖ్యప్రద శాంత్యేకమత్యనిలయమై మానవ ప్రపంచము వెలువడినది. ఆదినుండియు నీవిశ్వము మాయా వశంవదమగుటవలన నందుండు సర్వవ్యక్తులకును మాయా గృహావాసము సంభవించినది. అందువలన మాయావిమోహితాత్ములగు మానవులు,

> క్షణం బాలో భూత్వా క్షణమపి యువా కామరసికః
> క్షణం విత్తైర్హీనః క్షణమపిచ సంపూర్ణవిభవః
> జరాజీర్ణై రంగైర్నట ఇవ వళీమండితతనుః
> నరస్సంసారాంతే విశతి యమధానీయవనికామ్.
>
> భర్తృహరి.

ఇవ్విధమునఁ గొంతకాలము బాలురగను, గొంత కాలము విషయాసక్త చిత్తంబునఁ గామాభిలాషఁగల యౌవనవంతులుగను, గొంతకాలము దరిద్రులుగను, గొంత కాలము ధనికులుగను, సంసారకూపంబునఁ జిక్కి కూపస్థ మండూకంబు వడువున ముక్కునకుఁ జక్కనిదె యాకాశం బనియుఁ దమగొందియయే యీవిశ్వమనియుఁ జరించుచుఁ దుదకు జరాభారంబు దమ్ములము కొనుఁడు సకలావయవముల పట్టు వదలి నాటకము ముగిసిన తరువాత నంతదనుక ననేక వేషములు వేసి వేసటపడిన శైలూషులవలె యమపురమనెడి తెరమరుగున కరుగుచుండిరి. వెండియు నజ్ఞానాంధకారంబునఁ బడి విషయప్రమత్తులగుచుఁ జచ్చుచుఁ బుట్టుచు మఱల

చరిత్రచర్వణు లగుచుండిరి. ఇట్టి మాయామోహితులగు మానవప్రపంచోద్ధారణంబునకై 'భక్తి' యను సాధన ముత్పన్నమైనది. తత్సాధన సహాయ సంభక్తిమూలమునానే విశ్వోద్ధారణము జరుగుచున్నది.

## ౨. పరబ్రహ్మస్వరూపము.

భక్తిమార్గమునుఁ గూర్చి విచారించుటకుఁ బూర్వము తదాధారభూతంబగు పరబ్రహ్మతత్త్వమును గొంతవఱకు గుర్తెఱుంగుట యుక్తముగదా? అహంబ్రహ్మ, తత్త్వమసి, త్వమసి, యను శంకరవచన ప్రకారంబు విచారించినచోఁ బరబ్రహ్మమనునది వేఱొకటి లేదు. సర్వము నతని [illegible]మున నే నిలువవలసి యున్నది. నతఁడే సర్వమునకు మూల కారణుఁ డగుచున్నాఁడు. దానిచే ననుసరించిన భక్తి స్థానమే లేదు. నతఁడే పరబ్రహ్మమగుచో నేమి చేయుట్కి సంబంధ మాతని కెట్లుగలుగఁగలదు? అసంబంధమే యగుచో నాతని హృత్పద్మమున భక్తిరస మెట్లుత్పన్నము గాఁగలదు? పరబ్రహ్మమును గూర్చి మానసికదృశ్యమో లేక బాహ్య ప్రపంచదృశ్యమో యుండినఁగాని భక్తి యుత్పన్నమగు. ఆ దృశ్యమునకు వస్తు ప్రాధాన్యమో, లేక సంకల్పస్వరూప ప్రాధాన్యమో యుండవలయును. కావున భక్తికి మూలము పరబ్రహ్మ మగుచున్నది. తన్మూలమున భగవంతుఁడను నా డొకఁడున్నాఁడని . తెల్లమగుచున్నది. అగుచో భగవత్స్వరూప నిరూపణము గావలయును. ఏతత్స్వరూప సంపూర్ణ

మాత్రంబున భక్తి యుత్పన్న మగునప్పుడు తద్వృత్తంబునఁ గొంతవఱకు సత్యప్రభావ మిమిడి యుండవలయునుగదా?

యతోవా ఇమాని భూతాని జాయంతే
యేనజాతాని జీవంతి యత్ప్రయన్త్యభి సంవిశంతి
తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మేతి.

తైత్తిరీయోపనిషత్తు.

"That from which all that exist have come into being, that by which, after coming into being, all what are, continue to be, that towards which all objects move and into which all objects enter, know that as Brahman."

ఎవనినుండి యీవస్తుజాలమంతయుఁ బుట్టినదో, యెవనివలన నీపుట్టినదంతయు జీవించుచున్నదో తుద కెవని యందిదియన్నియు లీనమగుచున్నదో యదియే పరబ్రహ్మ మని తెలిసికొనుమని తైత్తిరీయోపనిషత్తు బోధించుచున్నది. ఇంకను—

నతత్రసూర్యోభాతి నచంద్రతారకం
నేమావిద్యుతో భాంతి కుతోయమగ్నిః
తమేవభాన్త మనుభాతిసర్వం
తస్యభాసాసర్వ మిదంవిభాతి.

కఠోపనిషత్తు.

అతఁడు వెలుఁగుచుండఁగా సమస్తమును వెలుఁగును. అతని ప్రకాశమువలననే సమస్తవస్తువులును బ్రకాశించును. అని కఠోపనిషత్తు తెల్పుచున్నది.

పరబ్రహ్మస్వరూపమును గూర్చి శ్రీ చైతన్యులవా రిట్లు చెప్పుచున్నారు—

"The specific meaning of Brahman is Bhagavan, who is possessed of absolute spiritual powers and has neither equal nor superior. His manifestations and His body are all of spiritual form; ignoring these spiritual forms and manifestations, they call Him formless."

దీనినిగూర్చి శ్రీకృష్ణభగవానుఁ డిట్లు సెలవిచ్చుచున్నాఁడు.

అనాది మత్పరం బ్రహ్మ నసత్తన్నా సదుచ్యతే
సర్వతః పాణిపాదంతత్సర్వతోఽక్షి శిరోముఖం
సర్వతః శ్రుతి మల్లోకే సర్వమావృత్య తిష్ఠతి
సర్వేంద్రియగుణాభాసం, సర్వేంద్రియ వివర్జితమ్
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ
బహిరంతశ్చ భూతానా మచరం చరమేవచ
సూక్ష్మత్వాత్త దవిజ్ఞేయం, దూరస్థం చాంతికేచతత్
అవిభక్తంచ భూతేషు విభక్త మివచస్థితమ్
భూతభర్తృచతజ్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణుచ
జ్యోతిషామపితజ్జ్యోతి స్తమసః పరముచ్యతే
జ్ఞానంజ్ఞేయం జ్ఞానగమ్యం హృదిసర్వస్య విష్ఠితమ్.

భగవద్గీత. ౧౩ అధ్యా.

ఈయాధారంబుల మూలంబునఁ బరబ్రహ్మస్వరూప మనఁగా సృష్టి స్థితిలయములకు మూలమైనదని తెలియ వచ్చుచున్నది. వెండియు నియ్యది భూమిలో నివసించుచు భూమితో భిన్నమగుచున్నది. ఆత్మలో వసించుచు నాత్మా రామమగుచున్నది. కావుననే యాత్మయే పరమాత్మస్వరూప మని కొందఱి మతము.

ఇప్పటికిఁ బరబ్రహ్మస్వరూపమన నెట్టిదో కొంత వఱకుఁ దెలియవచ్చినది. కాని తత్ప్రకృతియెట్టిదో తెలియ లేదు. ప్రకృతిని గుర్తించుట సాధ్యమైనది కాదు. సర్వప్ర కృతి యాతని ప్రకృతి యగుచున్నది. అది సాకారమయ్యును నిరాకారమగుచున్నది. విశిష్టమయ్యును నిర్విశిష్టమగు చున్నది. హ్రస్వమయ్యును దీర్ఘమగుచున్నది. స్థూల మయ్యును సూక్ష్మమగుచున్నది. ఇదియే భగవన్మాయ. ఇదియే మాయాస్వరూపము. ఏది యెటులున్నను, భగవం తునిఁ గూర్చి శ్రుతులిట్లు వలుకుచున్నవి—

సతన్మయో హ్యమృత ఈశసంస్థోజ్ఞః
సర్వగో భువనస్యాస్య గోప్తా
య ఈశే అస్యజగతో నిత్యమేవ
నాన్యో హేతుర్విద్యత ఈశనాయ.

భగవంతుఁడే ప్రపంచమున కాత్మ. మరణము లేని వాఁడు. పాలకత్వమాతనిదే. ఆతఁడు సర్వజ్ఞుఁడు. సర్వ

వ్యాపి. విశ్వరక్షకుఁడు. నిరంతర పరిపాలకుఁడు. ఇదియే భగవన్మహిమనుగూర్చియుఁ దత్ప్రకృతినిఁ గూర్చియు శ్రుతులు దెలియఁజేయు సందేశము. ఇప్పటికి భక్తికి మూలకారణమైన పరబ్రహ్మ స్వరూపమును గూర్చియుఁ దన్మహిమను గూర్చియుఁ గొంతవఱకుఁ దెలియవచ్చినది. ఇఁక భక్తిమార్గమును గూర్చి తెలిసికొనవలయును.

## ౩. భక్తి నిరూపణము.

భగవత్స్వరూపమహిమాదులు గొంతవఱకు నిరూపితములైనవి. ఇఁక భక్తి స్వరూప నిరూపణము గావలయును. లేనిచో భక్తినిగూర్చి యెట్లు దెలిసికొనఁగలము? కావున ముందు భక్తియన నేమో విచారింతము.

'సా తు పరమప్రేమరూపా'

ఉత్కృష్టమైన ప్రేమస్వరూపమే భక్తిస్వరూపమగుచున్నది.

"అనిర్వచనీయం ప్రేమస్వరూపం
గుణరహితం కామనారహితం
ప్రతిక్షణ వర్ధమానం అవిచ్ఛిన్నం
సూక్ష్మతరం అనుభవరూపం"

ఈ ప్రేమ స్వరూప మనిర్వచనీయమైనది. గుణముల కతీతమైనది. కోరికల కందనిది. ప్రతి క్షణమున [illegible]

చుండునది. ఎడతెగనిది. మిగుల సూక్ష్మమైనది. అనుభవస్వరూపమైనది. కాని యీప్రేమ యవస్థాభేదములంబట్టి పరిణామభేదమును బొందుచున్నది. ఈ ప్రేమయే కాంతాసక్తమైన యెడలఁ బ్రణయానురాగముగను, సుతునియందుఁ దవిలి యుండినఁ బుత్రవాత్సల్యముగను, దల్లిదండ్రులపై నున్న మాతాపితరులయందుంచవలసిన సహజప్రేమగను నిట్లనేక విధములఁ దత్పాత్రానుకూలంబుగ రూపభేదంబును బొందుచున్నది. వస్తువొక్కటియే యైనను—

> నీరము తప్తలోహమున నిల్చి యనామకమై నశించు నా
> నీరమె ముత్యమట్లు నళినీదళసంస్థితమై తనర్చు నా
> నీరమె శుక్తిలోఁబడి మణిత్వముఁగాంచు...... భర్తృహరి.

ఇవ్విధముగ వివిధమార్పులకు లోనగుచున్నది. పితృభక్తి, మాతృభక్తి, గురుభక్తి, భ్రాతృభక్తి, మొదలుగాఁగల రూపములెన్ని యేనియు నీభక్తియందిమిడియున్నవి. కాని వానినన్నింటిని 'భక్తి' యనుపేరున వ్యవహరించుట సమంజసముగాదు. భక్తియను శబ్దమున కివి సరికానేరవు. అవి యన్నియు భక్తియొక్క సాన్వయాకారములని పిలువఁబడును. కాని నిజమగు భక్తిస్వరూప మెట్టిది?

'దేవపూజాది ష్వనురాగ ఇతి పారాశర్యః'

దేవపూజానురాగమే భక్తియని వ్యాసునిమతము. ఇంకను మతభేదముల ననుసరించి భక్తికి వివిధరూపములు చెప్పఁబడియున్నవి. భగవత్కథాసరణి యందాసక్తియే భక్తి యని గర్గునిమతము. సర్వమీశ్వరున కర్పించి తత్స్మరణ మించుక మఱచినచో మిగుల వగలఁబొగులుటయే భక్తియని నారదుని మతము. ఇంకను—

అంకోలం నిజబీజ సంతతి రయస్కాంతోపలం సూచికా
సాధ్వీ నైజవిభుం లతా క్షితిరుహం సింధుస్సరిద్వల్లభం
ప్రాప్నోతీహ యథా తథా పశుపతేః పాదారవిందద్వయం
చేతోవృత్తి రుపేత్య తిష్ఠతి సదా సా భక్తి రిత్యుచ్యతే॥

శివానందలహరి.

ఊడుగుచెట్టు దానిగింజలను, సూది యయస్కాంత మును, పతివ్రత తనపెనిమిటిని, నది సముద్రమును, లతలు వృక్షమును, దవిలియుండు చందంబున, మానవుని హృద యము సదా యీశ్వరుని పాదారవిందయుగళ సేవనంబున నిలిచియుండుటయే భక్తియని శంకరుని మతము. మతభేదం బులం బట్టి రూపంబులు పెక్కు లేర్పడినను, నన్నియు భగవ త్పరముగఁ జూపు ప్రేమస్వరూపమే నిజమగు భక్తిస్వరూప మని పలుకుచున్నవి. ఇంకను దీనిఁగూర్చి భక్తాగ్రేసరుండగు ప్రహ్లాదుఁడిట్లు పలుకుచున్నాఁడు.

యాప్రీతి రవివేకానాం విషయేష్వనపాయినీ
త్వాం అనుస్మరతస్సామే హృదయాన్మాపసర్పతు.

భాగవతము.

ప్రేమ! ఎవరియందు? జగదీశ్వరునియందు. ఇతరుల యెడ నెంతప్రేమ యున్నను నది భక్తి కానేరదు. ఈయభిప్రాయమే రామానుజాచార్యుని మతము. సర్వ ప్రపంచము పూర్వబహుళజననకృతకర్మ ప్రతిఫల జనన మరణములకు లోనగుచుండుటవలన, నట్టి ప్రాపంచిక జీవులపైఁ జూపు ప్రేమ పరమప్రేమ కానేరదు. పరమాత్మునియందుఁ జూపు నదియే పరమప్రేమ. అదియే భక్తి. భక్తియనఁగా దైవభక్తి. ఇదియే భక్తిస్వరూప నిరూపణము.

## ౭ భక్తిప్రభావము.

భక్తియన నేమియో తెలిసినది. ఇఁక భక్తిప్రభావముఁ గూర్చి కొంతవఱకేనియుఁ దెలిసికొనవలయును. భక్తి యందు భగవత్ప్రశంస నిరూఢమై యున్నప్పుడు భగవన్మహిమ ననుసరించు మహిమయు నద్దానియందు చేరి యుండవలయుఁగదా? అవును—

"సాతు అమృతస్వరూపా"

భక్తి యమృతమువంటిది. అనఁగానాశనరహితమైనది. భక్తి యీశ్వరుని యందుఁ దప్ప మరియొక వస్తువునం దుండఁ జాలదు. భావముకర్మయు దీని కతీతములుగావు. దానికదియే గమ్యము. జడత్వము, సోమరితనము, మొదలగునవి భక్తి యందుండఁజాలవు. మనోవాక్కాయకర్మంబులయందేకరీతిగా నయ్యది పరిణమించును.

మయి భక్తి ర్హిభూతానా
మమృతత్వాయకల్పతే.

భాగవతము.

అని పైని దెలుపఁబడిన యభిప్రాయమును వ్యాసుఁడు గూడ స్థిరపఱచుచున్నాఁడు. ఇంకను భక్తిప్రభావమునుగూర్చి విదేశీయులు నిట్లు వల్కుచున్నారు.

భవమహారోగమున కహం భావమునకు
దైవభక్తియె దివ్యౌషధంబు సూవె.

జలాలుద్దీను.

అని పారసీక కవియగు జలాలుద్దీను పల్కినాఁడు. సంసారసాగరతరణమునకు భక్తియే పరమనిరపాయకరమగు నావ. మొదలు భక్తియనఁ బ్రేమయని తెలిసికొంటిమి. ఈ ప్రేమనే హూణులు 'విశ్వప్రేమ' (Universal Love) యని పల్కుచున్నారు. ఈ విశ్వప్రేమనుగూర్చి మనము బ్రహ్మ

నందమని పల్కుచున్నారము. అందువలన భక్తిస్వరూపము బ్రహ్మానందస్వరూపమగుచున్నది. కావుననే నిజమగు భక్తి స్వరూప గర్భకుహరంబున నానందోన్మత్తత, శాంతి, పరమార్థత్వము మున్నగునవి ప్రకాశించుచున్నవి. ఈయభిప్రాయంబున కనుకూలంబుగఁ దైత్తిరీయ మిట్లు వలుకుచున్నది.

'Anandam is Universal Love. That is what is called Bhakti. From Anandam have all these things come into being, having come into being, by Anandam, are they kept alive, to-wards Anandam do they move and into Anandam do they enter.'

ఆనందమనఁగా విశ్వప్రేమయనియు, విశ్వప్రేమయే భక్తి యనియు, నట్టి యానందమునుండియే సర్వవస్తువులు సృజియింపఁబడినవనియు, దానివలననే వీనికిఁ బ్రాణరక్షణము జరుగుచున్నదనియు, దానివైపునకే యివి యన్నియుఁ బరిభ్రమించుచున్నవనియు, దానియందే యివి యన్నియు లీనమగుచున్నవనియు దీని తాత్పర్యము.

ఈ యభిప్రాయంబు మూలమున నానంద స్వరూపమే భక్తి స్వరూపమనియుఁ దత్ప్రభావమే భక్తి ప్రభావమనియుఁ దెల్లమగుచున్నది. కాని యీ యానంద స్వరూపమే పరబ్రహ్మ స్వరూపమని కొందఱి మతము. తన్మతానుకూలం

బుగఁ బలికిన భక్తి స్వరూపము పరబ్రహ్మ స్వరూపమగు చున్నది. కాని పరబ్రహ్మ భక్తిస్వరూపము లొక్కటియే యయిన శేష శేషిత్వ సంబంధంబు నశించుచున్నదిగదా ? ఈ శేష శేషిత్వ సంబంధమేకదా భక్తికి మూల కారణము ? ఇదియే నశించిన భక్తి యెట్లు గలుగును ? ఇది యొక గొప్ప సంశయము. కాని సంశయ నివారణమున్నది. భక్తి యందును, భగవంతుని యందును నొక విధమగు సంబంధ మున్నదని మన మందఱు నొప్పుకొనక తప్పదు. భక్తివలనఁ దత్సంబంధము భక్తున కేర్పడుచున్నది. ఈ సంబంధమే అన య[illegible] ప్రేమ (Personal Love) యని పిలువబడుచున్నది. ఈ సంబంధము కాలక్రమము ననుసరించి నాలుగంతరములు గలదియగుచున్నది. మొదటి సంబంధము శేష శేషిత్వ సంబంధమే. భక్తుఁడు మొదట భగవంతునకు సేవకుఁడగు చున్నాఁడు. పిదప భక్త్యభివృద్ధి ననుసరించి భగవత్సమీప సంబంధ మేర్పడుచున్నది. అప్పుడు భక్తుఁడు భగవన్మిత్రుఁడగు చున్నాఁడు. మూఁడవ యంతరంబున భక్తుఁడు మిత్రత్వమును విడి సుతత్వమును గైకొనుచున్నాఁడు. కాలము గడచిన కొలఁది నియ్యదియు నదృశ్యమగుచున్నది. అప్పుడు భక్తునకు నక్తి సాధోపరిభాగ నివాసమేర్పడుచున్నది. ఇఁకఁ జెప్ప [illegible]దేమున్నది? భక్తభగవాను లేక మగుటయేగదా ! [illegible] మున భక్తి తన స్వరూపమును భగవత్స్వ[illegible]

మొనర్చుచున్నది. అందువలననే భగవత్స్వరూపము భక్తి స్వరూపము, భగవత్ప్రభావము భక్తి ప్రభావము, నగుచున్నవి. ఇఁకఁ దత్ప్రభావమును గూర్చి యడుగనేల ?

జహాఁ రామ్ ఉహాఁ కాంనహీఁ
జహాఁ కాంనహీఁ రాం. తులసీదాసు.

రాముఁ డెచ్చట నుండునో యచ్చటఁ గామమునకుఁ దావులేదు. కామ మెచ్చట నుండునో యచ్చట రామునకుఁ దావులేదు. ఇదియే తులసీదాసుని యభిప్రాయము. ఇదియే భగవత్ప్రభావము. ఇదియే భక్తిప్రభావము. నిష్కామ్యము నిష్కాపట్యము, నిష్పాతికము, మొదలగు నవి భక్తి యొక్క గుణములై యున్న యవి.

## ౫ భక్తి విభాగము.

భక్తియన నేమియో భక్తి ప్రభావమన నెట్టిదియో కొంతవఱకుఁ దెలిసినది. ఇఁక భక్తి విభాగమును గూర్చి విచారింపవలయును. భక్తి విభాగమును గూర్చి విచారించుటకుఁ బూర్వము దైవభక్తి విభాగమునుగూర్చి విచారించుట ముఖ్యావశ్యకము. ఇంతవఱకు భక్తియన దైవ భక్తియని సిద్ధాంతీకరణమైనది. ఈ దైవిక భక్తి యందును బెక్కు మార్పు లున్నవి. ఇందు శివభక్తి విష్ణుభక్తి యను నవియే

ముఖ్యములు- ఇందు భక్తుఁడు గమనింపవలసిన భక్తియేది ? శివభక్తియా ? విష్ణుభక్తియా ?

శివాయ విష్ణురూపాయ, శివరూపాయ విష్ణవే
శివస్య హృదయం విష్ణు ర్విష్ణోశ్చ హృదయగ్ుం శివః

అను వచనంబు ననుసరించిన శివకేశవులయం దీష న్మాత్రమేనియు భేద మగపడుటలేదు. ఇంకను—

మద్భక్తో శంకరద్వేషీ, మద్వేషీ శంకరప్రియః
తా వుభౌ నరకంయాతః, యావచ్చంద్ర దివాకరౌ॥

అను వచనంబువలనను, వాఁడేవీఁడు—వీఁడేవాఁడు—అనునది సూచింపఁబడు చున్నది. శివుని భజించుట విష్ణువును భజించుటయే. విష్ణువును భజించుట శివుని భజించుటయే. కావున భక్తున కిందు భేదబుద్ధి పనికిరాదు.

ఇప్పటికి దైవభక్తి విభాగమును ముగించితిని. ఇఁక భక్తి విభాగమును గూర్చి తెలిసికొన వలయును. తొలుత భక్తి ప్రపంచమున మూఁడు విభాగము లేర్పడుచున్నవి. అయ్యవి త్రిగుణ ప్రధానము లగుచున్నవి. ౧ తామసము ౨ రాజసము ౩ సాత్వికము. ఇవియుఁ దిరిగి మూఁడు భాగము లగుచున్నవి. తామసమునుండి యార్త భక్తియు, రాజసమునుండి సహేతుకభక్తియు, సాత్వికమునుండి యహేతుకభక్తి

యు, (అనఁగా మూఢ భక్తియు) నుత్పన్నము లగు చున్నవి. కాని వీనియందు

ఉత్తరస్మాదు త్తరస్మాత్ పూర్వపూర్వాత్ శ్రేయాభవతి.

మొదటి దానికన్న రెండవదియు, రెండవ దానికన్న మూఁడవదియు, శ్రేయోదాయ కములగుచున్నవి. ఇంకను విచారించిన - అహేతుకభక్తి పదునొకండు రూపములను దాల్చుచున్నది.

గుణమాహాత్మ్యాసక్తి, రూపాసక్తి పూజాసక్తి
స్మరణాసక్తి దాస్యాసక్తి సఖ్యాసక్తి వాత్సల్యాసక్తి
కాన్తాసక్తి ఆత్మని వేదనాసక్తి తన్మయాసక్తి
పరమ విరహాసక్తి రూపైకధా ప్యేకాదశధా భవతి.

ఇవియే యహేతుకభక్తి గర్భంబునఁ బ్రకాశించు వివిధరూపములు. ఇదియే భక్తివిభాగము. ఇఁక నీ వివిధరూప ప్రభావములనుగూర్చి కొంతవఱకుఁ దెలిసికొనుట సమంజసము.

గుణత్రయ ప్రధానంబగు భక్తిత్రయమునందు సాత్త్వికము దప్ప రాజస తామసములు విషయాసక్తములగుచున్నవి. విషయాసక్తమైన భక్తి శ్రమ రహితము గాదు. అందు మార్దవములేదు. మధురములేదు. అయ్యది నిరంతరోత్సాహజనక పరప్రేమ సంభరిత బ్రహ్మానంద నిలయముగాదు. ఇట్టి [illegible]

విష్ణుసాయుజ్యమున కనువగు మార్గము గానేరదు. దీనివలన జీవికి—

> వర్గత్రయ పరత ముహుః
> స్స్వర్గక్ష్మా మధ్యమాధ్వ జాంఘాలికతా
> దుర్గతియు.........

ఒక్కొకప్పుడు లభింపఁగలదు. తల్లభ్యంబువలనఁ గొం డొకవేళ జీవి కుమార్గ గామియుఁ గావచ్చును. ఈ భక్తివలన జీవులు విషయాసక్తు లగుటఁ జేసి వారి హృదంతరాళముల నిష్కామత్వము నిలువనేరదు. రాజసతామస భక్తి స్వరూ పము లివియే. వివిధభోగార్థియై తల్లభ్యంబు కొఱకు భగవ ధ్యాన మొనరించువాఁడు రాజస భక్తి పరుఁడగుచున్నాఁడు. ఆర్తాపహారణంబున కేనియు భయ నివారణంబున కేనియు భగ వద్భజన సల్పువాఁడు తామసభక్తిపరుఁ డగుచున్నాఁడు. ఈ భక్తిద్వయంబువలన నాశాసంహారణంబు గానేరదు. ఆశాసంహారణంబుఁగాకున్నచో జీవి యింద్రియ వ్యాపార నిమ గ్నుఁడగు చున్నాఁడు. ఇంద్రియ వ్యాపార నిమగ్నమగు హృదయమెల్ల వేళల నుద్వృత్తపవనహతిని బయోనిధిలోఁ గలము చలించునట్లు చలించుచుండును. చలితచిత్తులు, కపట జగన్నా టక సూత్రధారియైన నారాయణునిఁ గూర్చి—

(సర్వం విష్ణు మయమ్.)

అని పలుకఁ జాలరు. ఒకవేళ పలికినను, బలికిన పలుకునఁ దొలఁగక నిలువఁజాలరు. కావుననే యయ్యది రజస్తమో గుణాక్రాంతమైనది. కాని యీభక్తియందును గొంత యుపయోగము లేకపోలేదు. విషయాసక్త పరివృత ప్రపంచ జనితులగు జీవులందఱొక్క పరియే విషయపరిత్యాగు లగుట దుర్లభంబు గదా? కొందఱు పుట్టుకతోడనేభక్తులఁగావచ్చును. కొందఱుపాసనాబలంబువలన భక్తులుఁగావచ్చును. కొందఱు భక్తి ప్రభావమునే యెఱుంగని మూఢులు గావచ్చును. అట్టి మూఢులొక్క పర్యాయముననే సాత్త్వికభక్తి సంపాదనాపరులు గానేరరు. వారి కీరజస్తమోగుణాకలితంబగు భక్తి సాత్త్వికభక్తి హర్మ్యారోహణంబునకనువగు మార్గముఁగావచ్చును. మొదలు భక్తియనునది యొకటి యేర్పడినఁ దన్మూలమున నద్దాని వివిధరూప ప్రభావములు దెలియఁగలవు. అయ్యవి తెలిసిన తోడనే సాత్త్వికభక్తి పూర్వస్థానమున బ్రవేశించుచున్నది. దీని కుదాహరణముగా ధ్రువుని వంకఁ దిలకింపుఁడు. ఆతని భక్తి తొలుఁదొల్త రజస్తమోగుణాక్రాంతమే. పరాభవప్రతీకారాభిలాష యాతని భక్తియందిమిడి యున్నది. కాని నారదోపదేశంబువలనఁ దద్భక్తి వలని యుపయోగంబును, దదభ్యాసంబున లభించు గతియుఁ దెలియనగ్గుటంజేసి యాతని భక్తివెంటనే సాత్త్వికముగా మారినది.

కావున రజస్తమోగుణాకలితంబగు భక్తి సాత్త్వికభక్తి సౌధారోహణంబున కనువగునది యని తెలియనగును.

రాజసతామస భక్తి స్వరూప గుణ ప్రభావంబులు కొంతవఱకుఁ జెప్పంబడినవి. ఇంక సాత్త్వికభక్తిఁ గూర్చి యెఱుంగ వలయును. ఇద్దానినిఁ గూర్చి —

"సా న కామయమానా నిరోధరూపత్వాత్"

అని యుండుటవలన నిది నిరోధ స్వభావముఁ గలది యగుచున్నది. ఇందుమూలమున నియ్యది విషయవాంఛల కనుకూలింపదు. నిరోధమన నైహిక వ్యాపారములు మున్నగు వాని నడ్డగించుట. కాని దీనిఁగూర్చి కొందఱు—

"తస్మిన్ననన్యతా తద్విరోధిషూదాసీనతా చ"

ఈశ్వరునియందే శ్రద్ధ కనిష్ఠఁగలిగి, తదితరముల యందుఁ జిత్తమునుఁ జొప్పింపకుండుటయు నిరోధమనఁబడునని తెల్పుదురు. ఏది యెట్టులున్నను, సాత్త్వికభక్తియందు దంధ ప్రేమఁగాని, సంకుచిత భావముగాని లేదు. కావుననే విష్ణు సాయుజ్యమున కియ్యది శ్రేయోదాయకమని పలుకఁబడినది.

గుణత్రయమాకలితంబగు భక్తి లక్షణము తెలియఁబడినది. ఇఁక వీని ననుసరించి యుత్పన్నమైన భక్తిఁగూర్చి

విచారింతము. తొలుత తామసమును గైకొనుఁడు. అద్దాని నుండి యార్తభక్తి జనించుచున్నది. ఆర్తివలన జనించునది యార్తభక్తి. శత్రువినాశముఁ గూర్చియో, భయ నివారణము కొఱకో, కష్టములు ప్రాప్తించిన కాలముననో, భగవంతునిఁ బ్రార్థించిన నయ్యది యార్తిమూలమున జనించినది కావున నార్తభక్తి యగుచున్నది. ఇయ్యది సకారణమగుటవలన నుత్తమభక్తి కానేరదు. ఇఁక రాజసమునుఁ దిలకించిన దాని నుండి సహేతుక భక్తి జనించుచున్నది. ఇందును హేతువు నిరూపింపఁ బడుచున్నది. అనపత్యత వలననో, దరిద్ర దేవతా పీడనంబువలననో, తదితరముల వలననో, భగవంతుని ధ్యానించుటయే సహేతుకభక్తి యనంబడును. ఆర్తభక్తియు సహేతుక భక్తియు రెండునుఁ గారణసహితంబులై యున్నను వీనియందు భేదమున్నది. సహేతుకభక్తియందుఁ గేవలము యాచకత్వము నిండియున్నది. ఆర్తభక్తియందును యాచకత్వ ముండకపోలేదు. కాని తల్లక్షణము వేఱు. దీనికిఁ బ్రమాణమేమన —

'ప్రమాణాన్తర స్యానపేక్షత్వాత్ స్వయం పరిమాణత్వాత్'

దాని కదియే నిదర్శనము. మఱొం డావశ్యకములేదు.

ఆర్తసహేతుకము లిట్టివి. ఇంక సాత్త్వికమునుండి యుత్పన్నములైన యహేతుక మూఢభక్తు లెట్టివో తెలియ

నగును. మూఢభక్తియన్ననో యొక కొండగుఱ్ఱ వంటిది. ఈ భక్తివలన భగవల్లక్షణ మెద్దియో, భగవదారాధన మెట్లుండవలయునో, మున్నగు విషయములు తెలియనే తెలియవు. ఈ భక్తివలనఁ గలుగునది యొకేవస్తువునందు లక్ష్యముంచి తల్లక్ష్యమును దృష్టిపథము నుండి తొలంగనీయక మెలంగుటయే. అనఁగా నొకవిధమగు గురి. ఈ గురివలననే మూఢభక్తి సర్వోత్తమ మగుచున్నది. ఈ భక్తి వస్తుతత్త్వమును, గావ్య క్రమమును, మంచి చెడుగులను, మున్నగువాని నెఱుంగనీయదు. దీని కుదాహరణము శబరి. ఆమె కేవలము మూఢభక్తురాలు. కావుననే యెంగిలి పదార్థ మశుచియని యెఱుంగఁజాలక పోయినది. ఆమె చిత్తమంతయు భగవంతునకు మధుర ఫలాహార మొసంగవలయు ననెడి తలంపు నందే లగ్నమై యుండెనుగాని తాను కొఱికి చూచిన పదార్థ మశుచి యగునని యెఱుంగఁ జాలక పోయినదిగదా? ఇదియే గదా మూఢభక్తి? ఇంకనుఁ గాళహస్తి మహాత్మ్యమునఁ బేర్కొనఁబడిన శివభక్తునిఁ గన్నప్పను దిలకింపుఁడు. అతని భక్తి యింతకన్నను మూఢభక్తి. అతని భగవదారాధన విధానమును బరికింపుఁడు. వివిధ నుతినమస్కారభూయిష్ఠ మగు తన పాదరక్షనే పశుపతి శిరోభూషణముగ నిర్మాల్యసమార్జనము సేయుటకుం జెఁగా నుపయోగించినాఁడు. తాను పుక్కిటఁబట్టి కొని వచ్చిన యెంగిలినీటనే స్వామి యభిషేకంబునను [illegible]

యోగించినాఁడు. తనవలన రుచి చూడఁబడిన యెంగిలి మాంసమునే కాత్యాయనీధవునకు నివేదనముఁగా నర్పించినాఁడు. ఆహా! ఎంతటి మూఢ భక్తి? మూఢభక్తియందుఁ గల మాహాత్మ్యము దెలుప నలవికానిది. దానియందుఁ గల వస్తులక్ష్యము కొండొకదాని యందుఁ జూడఁ బడనేరదు. అందుండు మనోధైర్య మేనియు నింకొంకదానియం దుండఁబోదు. కావుననే గదా యిట్టి చేష్టలన్నియుఁ బరమాత్మునకుఁ బరమ పవిత్రము లగుటకుఁ గారణము?

మూఢభక్తిఁ గూర్చి విచారించితిమి. ఇఁక నహేతుక భక్తిఁ గూర్చి యోజింతుము. అహేతుక శబ్దార్థంబు మూలంబుననే యయ్యది కారణ రహితమగు భక్తి యని తెలియు చున్నది. అనఁగా విషయవాంఛారహిత మైనది. కాని యీ యహేతుకము నందొక విధమగు జ్ఞాన తేజము వెలుఁగుచున్నది. (ఇది సనాతనాభిప్రాయము.) అందుమూలముననే కాబోలు కొందఱు దీనిని జ్ఞానభక్తియని పలుకు చుండుట? ఇది జ్ఞానభక్తి యగుటవలన మూఢభక్తియందుఁ గన్పట్టుచున్న యాశ్చర్యవిషయము లెవ్వియును దీనియందుఁ గాన్పింపవు. జ్ఞానభక్తి యగుటవలననే యియ్యది వివిధరూపములఁ బరిణమించుచున్నది. జ్ఞానభక్తునకు మూఢభక్తునకుఁ గల యొకేభావము—ఒకేలక్ష్యము—ఒకేప్రవర్తనము—మొదలగు

నవి లభింపనేరవు. ఇందు జ్ఞానమన నర్థమేమి? వస్తుతత్త్వము పరబ్రహ్మతత్త్వము మొదలగునవి తెలియుటయే జ్ఞానము. ఇయ్యవి తెలియుటవలననే జ్ఞానభక్తుఁ డనేకవిధముల భగవంతునిఁ బ్రార్థించుచుండును. జ్ఞానుఁడగుటవలన గుణవర్ణనమునఁ జిక్కి గుణమాహాత్మ్యాసక్తిపరుఁడగుచున్నాఁడు. భావనా ప్రపంచంబునఁ బరమాత్మకు రూపమేర్పఱచి రూపాసక్తుఁడగుచున్నాఁడు. భజన మొనర్చుచు దాస్యాసక్తి నొందుచున్నాఁడు. కొన్ని వేళలందు—

„ఏల నాచెంతకు రావురా? ఓ నాప్రియుఁడా! ఏ
వేల నన్నేకాకినిఁగాఁ జేతురా!"

అనియుఁ గొన్ని వేళలఁ దన్మయావస్థలోఁ జిక్కి——

సురతవర్ధనం శోకనాశనం
స్వరితవేణునా సుష్ఠుచుంబితమ్
ఇతరరాగవిస్మారణం నృణాం
వితరవీర నస్తేఽధరామృతమ్॥

అనియు గాన మొనర్చుచు భగవత్సతీత్వమును గోరుచున్నాఁడు. ఇట్లు పైని తెలుపఁబడిన ప్రకార మీభక్తి క్రమక్రమముగ నేకాదశావస్థలకు లోనగుచున్నది. [illegible] భక్తియందీ యవస్థలెవ్వియుఁ గలుగవు. ఒకవేళఁ గలిగిన [illegible]

యన్నియు మూఢభక్తి సంజనితంబులే కాని జ్ఞానభక్త్యు ద్భవములు గావు. ఇదియే భక్తి విభాగలక్షణము.

## ౬ భక్తి పుట్టుక.

భక్తి స్వరూప ప్రభావంబులఁ గూర్చియు, భక్తి విభాగంబును గురించియుఁ గొంతవఱకుఁ దెలిసినది. కాని వీని నన్నిఁటిని మించిన ప్రధాన విషయ మింకొకటి యున్నది. ఇంతవరకు భక్తినిఁగూర్చిన చర్చయే జరిగినది కాని భక్తి యెట్లుపుట్టునో యను విషయమునుగూర్చి చర్చ జరిగినదికాదు. కావున భక్తి గలుగుటకు సాధనము లెవ్వియో విచారింతము.

'తత్తు విషయత్యాగాత్సంగత్యాగా చ్చ'

ఇదియొక సాధనము. ఇంద్రియ వికారములను, మమకారమును వీడిన భక్తినిఁ బొందవచ్చును.

'అవ్యావృత్త భజనాత్'

ఇది మఱియొక మార్గము. సంతత భగవద్భజనంబు వలన వికారములన్నియు నశించును. కనుక తన్మూలమున భక్తినిఁ బొందవచ్చును.

'లోకేపి భగవద్గుణ శ్రవణకీర్తనాత్'

ఇది యింకొకమార్గము. సంఘమునందున్న భక్తులతోఁ జేరి యీశ్వర సంకీర్తనమును సలుపుచుండిన భక్తి గలుగవచ్చును.

"తత్రాప్యజ్ఞాన మేవ సాధన మిత్యేకే"

కొందఱు జ్ఞానమే భక్తికి సాధనమందురు.

"ముఖ్యతస్తు మహత్కృపయైవ భగవత్ కృపాలేశాద్వా"

ఇది ముఖ్యముగా గమనింపఁబడవలసిన మార్గము. మహాపురుషుల దయచేత నైనను భగవంతుని కరుణాకటాక్షలేశమువలన నైనను భక్తిని బొందవచ్చును. ఈ విషయమునే యనుసరించి——

"నాయ మాత్మా ప్రవచనేన లభ్యో
న మేధయా న బహునా శ్రుతేన
యమేవైష వృణుతే తేన లభ్యః
తస్యైష ఆత్మా వివృణుతే తనూంస్వామ్."

ముండకోపనిషత్తు.

అని పైని చెప్పిన ప్రకారము పలుకుచున్నది. పైన తెలుపంబడిన మార్గంబులన్నియు భక్తిని బొందుటకుఁ దగిన సాధనంబులే. ఇవియన్నియుఁ బూర్వులవలన ననుకరింపఁబడి

నవియే. పరమ కిరాతుఁడగు వాల్మీకికి భక్తి లభ్యమగుట మహాపురుషుల కృపయే మూలకారణము. ప్రహ్లాదునకు నిదియే కారణము. వేయేల, ఈసాధనంబుల వలన భక్తినిఁ బడయ వచ్చును.

## ౭. మార్గప్రశంస.

ప్రపంచమున నింతవఱకీశ్వర సందర్శనమునకు నాలుగు మార్గములు దెలుపంబడి యున్నవి. అయ్యవి—

(a) జ్ఞానమార్గము.
(b) కర్మయోగ మార్గము.
(c) రాజయోగ మార్గము.
(d) భక్తిమార్గము.

ఈ నాలుగు మార్గంబుల మూలంబున భగవద్దర్శనంబునుఁ బడయవచ్చును. కావున వేర్వేఱ వీని లక్షణంబును—దారతమ్య ప్రభావంబులనుఁ గొంతవఱకు విచారించుట తగిన పనియేగదా? ముందు జ్ఞానమార్గమునుఁ గూర్చిన ప్రశంస—

(a) జ్ఞానమార్గము.

జ్ఞానమార్గమను శబ్దతత్త్వంబు ననుసరించిన నయ్యది వివేకముతోఁ గూడుకొనఁబడిన మార్గమని తెలియఁ బడు

చున్నది. ఇచ్చట వివేక మనుదానికి లౌకికవివేక మనెడి యర్థము సమన్వయింపఁ జాలదు. అయ్యది యాత్మానాత్మ లను గూర్చిన విచారణము. ఆత్మానాత్మవివేకముఁ గలిగి యైహికవాంఛా నిర్మూలన మొనర్చి కపటసంసారమునఁ దగుల్కొనక నిరంతరము పరబ్రహ్మతత్త్వమును గూర్చి విచారించుటయే జ్ఞానమార్గము. ఇయ్యది సంఘమున కంత కును సులభమైన మార్గముఁగాదు. అంతియగాక పైనిపేర్కొనఁ బడిన వివేకంబు మూలంబునఁ గొన్ని యెడల విషమసంక టములఁ దగుల్కొనుటయుఁ దన్మూలంబున సహజంబుగ మనోనిశ్చలత్వము లేకపోవుటయు సంభవించు చుండును. అట్లగుటంజేసియే సులభమార్గంబులుఁ బెక్కులు దెలుపంబడి నవి. మఱియు నీ జ్ఞానమార్గము నిస్సారమైనది. ఉత్సాహము లేనిది.

(b) కర్మయోగ మార్గము.

రెండవదియగు కర్మమార్గమును గూర్చి విచారించిన నియ్యదియు నైహికకర్మల లీనమగుచున్నది. స్వకర్మ పర కర్మలను విచక్షణము ననుసరించి యీ కర్మమార్గము రెండు విధములగుచున్నది. స్వకర్మమార్గముననుసరించి నిజ వాంఛా ఫలసిద్ధికై తగువిధములను గొన్నింటి నవలంబించి యిహము నను, బరకర్మమూలమున లోకోపకార మొనర్చి పరమునను

నిరంతర సుఖానుభవమునకై పాటు పడుటయే కర్మమార్గము. ఇందొకవంక స్వాభిలాషయు, మఱొకదెసఁ బరోపకారాభిలాషయుఁ గలిసి కలంబు మొనలవలె విభాగంబులైనను ఫలంబున సమంబు లగుచున్నవి. ఇది కర్మలంపటులకై తెలుపఁబడిన మార్గము.

(c) రాజయోగ మార్గము.

మూఁడవదియగు రాజయోగమార్గము కేవలము మనోనిగ్రహముపై నాధారపడియున్నది. బాహ్య విషయముల నుండి సర్వేంద్రియములను నిగ్రహించి యూర్ధ్వలోకప్రాప్తికిఁ గల యాటంకముల విచారించు కొనఁగల యంతశ్శక్తి సంపాదనకుఁ బాటుపడుటయే రాజయోగమార్గము. కందుపాసనాబలంబు వలయునని నిగూఢంబుగా సూచింపఁబడుచున్నది. ఇయ్యది ముని వృత్తి నవలంబించువారలకుఁ దెలుపఁబడినది. కాన సంఘానుసరణీయము గాదు.

(d) భక్తి మార్గము.

ఇంక నాలవదియగు భక్తిమార్గమునుగూర్చిన నియ్యది కేవలము భగవత్సాన్నిధ్యమును బడయుటకుఁ దెలుపం బడిన సులభమార్గము. ఇందు జీవుఁడు తన్నుఁ గూర్చి చింతాసాగరంబున మునుఁగ వలసిన యగత్యంబు లేదు. ఈశ్వరుఁడే తనసర్వ

స్వమని యెంచి తన సర్వస్వ మాతని కర్పించి తత్పాదసేవ నామోద సంభరిత చిత్తంబున వర్తిల్లుటయే భక్తునిమార్గము. ఇదియే భక్తిమార్గమును గూర్చిన లక్షణము. ఈ మార్గమును గూర్చి—

'సా తు కర్మజ్ఞానయోగేభ్యో ప్యధికతరా'

ఈ నాలుగు మార్గంబులయందు భక్తిమార్గమే యుత్తమమని నారదుని యభిప్రాయము. కర్మ జ్ఞాన రాజయోగ మార్గత్రయంబునం దొకవిధమగు ఫలాపేక్ష నిగూఢముగాఁ బ్రకాశించుచున్నది.

'సా తు ఫలరూపత్వాత్'

అయ్యది ఫలరూప మగుటవలనఁ దన్మార్గావలంబకులు సంకుచితచిత్తులై భగవంతునకు దూరస్థులై శాశ్వతశాంతిఁ బొందఁజాలరు. మఱియు స్వశక్తుల మూలంబునఁ దమతమ మార్గంబులనే యనుసరించి, తన్మూలమున భగవత్సందర్శనమునకు దూరమగుచుండ భక్తిమార్గావలంబకుఁడు తన సర్వస్వ మీశ్వరున కర్పించి యనవరత సంబంధమువలనఁ దత్సాన్నిహిత్యమును బొందుచున్నాఁడు. కావుననే భక్తిమార్గము సర్వోత్తమ మగుచున్నది. ఇంకను సర్వజనుల కుపయోగకరమగు సాధనల నీ భక్తిమార్గము—

'శ్రవణం, కీర్తనం, విష్ణోస్స్మరణం, పాదసేవనమ్
అర్చనం ,వందనం, దాస్యం, సఖ్యం చాత్మనివేదనమ్.'

అను తొమ్మిది మార్గములగుచు, నిందెద్దానినేనియుఁ దదవలంబకుఁడు భగవంతున కాత్మనివేదన మొసంగిన వో నట్టివానికిఁ దత్సాన్నిధ్యమును జేకూర్చుచున్నది. అనలంబున కాకర్షణ శక్తి లేకున్నను దన్ను జుట్టియున్నవారల చలినే పోఁగొట్టి దూరముననున్న వారి చలినిఁ బోఁగొట్ట లేనట్లు భక్తియుఁ దనయందనేక మార్గంబులున్నను నందలి భక్తి మార్గావలంబకులైన వారలనే భగవత్సాన్నిధ్యమునకుఁ జేర్చి తన్మూలమున వారి భవబంధనాశన మొనర్చుచున్నది. ఇదియే భక్తిమార్గము. వెండియు నీ భక్తి మార్గము ననుసరించిన జీవి—

'Sees self (his own self) in all things
And sees all things in the self'

సర్వ వస్తువులయందుఁ దన్ను దిలకించుచున్నాఁడు. తనయందన్ని వస్తువులను దిలకించుచున్నాఁడు. అందు వలననే శ్రీకృష్ణ భగవానుఁ డిట్లు సెప్పుచున్నాఁడు—

'He who sees Me every where
Sees every thing in Me;

I never pass out of his sight nor
Does he ever pass out of Mine'.

ఎవఁడు సర్వమునందు నన్నుఁ దిలకించుచున్నాఁడో వాఁడు సర్వమును నాయందుఁ దిలకించుచున్నాఁడు. అట్టివాని దృష్టి పథమునుండి నేనెన్నఁడును దొలంగి యుండను. మఱియు నా దృష్టి పథమునుండి యట్టివాఁ డెన్నఁడును దొలంగి యుండఁడు. ఈ భగవద్వాక్యంబు మూలంబుననే, కర్మజ్ఞాన రాజయోగ మార్గంబులకన్న భక్తి మార్గమే యుత్తమ మని పేర్కొనఁ బడినది.

## ౮. భక్తలక్షణము.

భక్తిస్వరూప నిరూపణము, భక్తిమార్గ నిర్ణయము, మున్నగునవి యన్నియు విచారింపఁబడినవి. కాని యీ యంశమున భక్తలక్షణమునుగూర్చియించుకేనియుఁ బేర్కొనం బడలేదు. భక్తిమార్గ ప్రధానులగు భక్తుల లక్షణమును గూర్చి విచారించుట కర్తవ్యాంశమున కనుకూలించిన పనియే గదా? కావున ‹భక్తుఁడెవఁడు? అను ప్రశ్న వచ్చినప్పుడు భక్తిమార్గమున నడచువాఁడే భక్తుఁడని వ్రాయవలయును.

‹నాస్తి తేషు జాతివిద్యారూపకుల ధనక్రియాదిభేదః›

ఈభక్తిమార్గమున నడచుటకు జాతివిద్యా రూపకుల ధనక్రియాది భేదములు లేవు.

'పుంస్త్వే స్త్రీత్వేవిశేషోవా జాతినామాశ్రమాదయః
న కారణం మద్భజనే భక్తిరేవ హి కారణమ్.'

అధ్యాత్మరామాయణము.

ఇంకను స్త్రీపురుష భేదములు మున్నగునవి భగవద్భజనంబునకుఁ గారణంబులు గానేరవు. భక్తియొక్కటియే దానికిఁ గారణమై యున్నది. ఇదియే భగవంతుని యభిప్రాయము. ఈ యుదాహరణంబువలన భక్తిమార్గ మన్నితెగలవారికిని రాజమార్గమై యున్నదనుట నిస్సంశయము. ఇఁక నిట్టిభక్తులనుగూర్చి తెలుపఁబడిన లక్షణము లెవ్వియో, కొంతవఱకుఁ బరిశీలింతము. ప్రధానలక్షణము భగవంతుని యెడల నిశ్చలప్రేమను గలిగియుండుటయే యనుట యెల్లరకుఁ దెలిసిన విషయమే గదా? తక్కిన లక్షణములన్నవో—

స్త్రీధననాస్తిక చరిత్రం న శ్రవణీయమ్ '

భక్తుఁడైనవాఁడు స్త్రీధననాస్తిక చరిత్రములను వినరాదు. ఇయ్యవి నిశ్చలభక్తికిఁ బ్రబల ప్రతిబంధకంబులని నొక్కివక్కాణింపక తప్పదు. ఏతచ్ఛ్రవణంబునఁ గొన్నివేళల మనస్సు చలింపవచ్చును.

'అభిమానదంభాదికం త్యాజ్యం'

తరువాత భక్తుఁడైనవాఁ డహంకారము, గర్వము, బడాయి, మున్నగువానిని త్యజింపవలయును. వీనిఁ ద్యజింపనం కున్న స్వాతిశయ స్వాభిమానంబు లెఱుఁగంట నేరవు. ఇవి యెఱుఁగంటకున్న శాంతినిలయమును, నానందమయమును నగు భక్తిగేహంబున నాకస్మికముగ కల్లోలములు పెల్లుగా నుప్పతిల్లవచ్చును. తన్మూలమున భక్తియు నశింపవచ్చును. ఇంకను—

'దుస్సంగః సర్వథైవ త్యాజ్యః'

అన్నివిధముల చేతను దుస్సహవాసమును విడవలయును. వెండియు—

'అహింసా సత్య శౌచ దయాస్తిక్యాది
చారిత్రాణి పరిపాలనీయాని'

అహింసా విధానమును, సత్యవ్రతాచరణమును, పవిత్రతను, దయాస్వభావమును, దైవిక విశ్వాసమును, మొదలగు వానిఁ బరిపాలింప వలయును. మఱియు—

యస్మిన్ ద్యౌ ర్యాపృథివీ చాన్తరిక్షం మారుతం మనః
సహస్రాంశుశ్చ నక్షత్రం తమోదైకం యాసతలిత్వాగ్నిః ।

అన్యావాచోవిముంచథ అమృతస్యైషహేతుః
ముండకోపనిషత్తు.

అను దాని భావప్రకారము—

'సర్వదా సర్వభావేన నిశ్చింతైర్భగవానేవ భజనీయః'

ఎల్లప్పుడును హృదయపూర్వకముగ, నన్యచింతలను వీడి భగవద్భజనంబును సలుపవలయును. ఇట్టివి యన్నియును భక్తలక్షణములుగాఁ జెప్పఁబడినవి. ఇట్టి లక్షణయుతులగు భక్తులయం దుత్తములు గొందఱుగలరు.

౯ ఉత్తమభక్తులు.

'భక్తా ఏకాంతినో ముఖ్యాః'

ఈశ్వరుఁడను నేకలక్ష్యమునఁ దమచిత్తంబుల లగ్నమొనర్చి యుపాసించువారలే భక్తులలో ముఖ్యులని తెలుపంబడియున్నది. ఇట్టి భక్తులందఱు భగవత్ప్రేమకుఁ బాత్రులగుచున్నారు.

'తత్ప్రాప్య తదేవావలోకయతి,
తదేవశృణోతి తదేవచింతయతి,

ఆ భగవత్ప్రేమ కొకపరిఁబాత్రుఁడైనవాఁడు సర్వకాల సర్వావస్థ సర్వస్థల సర్వవస్తు సముదాయంబునందుఁ దన యిష్టదైవమునే చూచుచుండును. దానిని గూర్చియే వినుచుండును. దానిని గురించియే యెల్లెడల ముచ్చటించుచుండును. తదీయ చింతనంబునందే కాలంబును గడపుచుండును. కావుననే ప్రహ్లాదుఁడు—

> పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్ భాషించుచున్ హాసలీ
> లానిద్రాదులు సేయుచున్ దిరుగుచున్ లక్షించుచున్ సంతత
> శ్రీనారాయణ పాదపద్మయుగళీ చింతామృతాస్వాద సం
> ధానుండై.

ఈ విశ్వము నంతయు మఱచినాఁడు. తన్మూలముననే నిత్య పరిపూర్ణుఁ డగుచుఁ దనరినాఁడు. ఇట్టి యత్యుత్తమ భక్త్యావేశుం డగుటవలననే—

> వైకుంఠచింతా వివర్జిత చేష్టుఁడై
> యొక్కఁడు నేడుచు నొక్కచోట
> నశ్రాంత హరిభావనారూఢ చిత్తుఁడై
> యుద్ధతుఁడై పాడు నొక్కచోట
> విష్ణుఁడింతయెకాని వేఱొండు లేఁడని
> యొత్తిలినగుచుండు నొక్కచోట
> నలినాక్షుఁడను నిధానముఁ గంటి నేనని
> యుబ్బి గంతులువైచు నొక్కచోట

బలుకు నొక్కచోటఁ బరమేశుఁ గేళవుఁ
బ్రణయ హర్ష జనిత బాష్పసలిల
మిళిత పులకుఁడై నిమీలిత నేత్రుఁడై
యొక్కచోట నిలిచి యూరకుండు.

ఇదియే యుత్తమ భక్తుని లక్షణము. ఇదియే భక్తి వలనఁ గలుగు తన్మయావస్థ. ఈ దైవిక ప్రేమ ననుభవించెడి భక్తుఁ డెల్లప్పుడు---

'నాస్థాధర్మే న వసునిచయే నైవ కామోపభోగే
యద్యద్భవ్యం భవతు భగవన్! పూర్వకర్మానురూపం,
ఏతత్ప్రార్థ్యం మమ బహుమతో జన్మజన్మాంతరేపి
త్వత్పాదాంభోరుహయుగగతా నిశ్చలాభక్తిరస్తు.

'ఈశ్వరా! నాకు ధనము వలదు. మిత్రులు వలదు. సౌఖ్యము వలదు. సౌందర్యము వలదు. విద్యగాని, స్వేచ్ఛ గాని వలదు. నాపూర్వకర్మము ననుసరించి నన్ను మరల మరలఁ బుట్టనిమ్ము. జన్మజన్మాంతరము లందును నీవే నాప్రేమాస్పదుఁడవు గమ్ము. త్వచ్చరణకమలయుగళ సేవనంబున నిశ్చలభక్తి గలుగనిమ్ము. నీవే శాశ్వతముగ నాకామితమవుగమ్ము.' అని యెల్లప్పుడును బ్రార్థించు చుండును. వెండియు నట్టి భక్తుఁడెల్లప్పు డన్నింటిలోనుండు మాధుర్యమును గొనును. అందఱితోడను గలసి మెలసి యుండును.

అన్నిఁటికి నవునని పల్కెను. కాని తన లక్ష్యస్థానమున మాత్రము స్థిరమగు నిశ్చలత్వమును గలిగి యుండును.

ఇంక వీరి ప్రభావమునుగూర్చి యడిగినఁ జెప్ప నలవియేగాదు. మిన్ను మన్నేకముగా నొనర్పగలరు. వారల కశక్యమను నది యొకటి లేదు. ఇట్టిప్రభావమునకుఁ బెక్కురు భక్తుల దివ్యచారిత్రంబులే యుదాహరణంబు లగుచున్నవి. తెలిసిన విషయమును నిందు విచారించుట యసంగతము గదా? భక్తులు తమ దివ్యశక్తివలన సర్వప్రపంచమును నొక మార్గమునకుఁ ద్రిప్పఁగలరు. దీనికిఁ దపోనిష్ఠాగరిష్ఠులగు సంయమీశ్వరులును, రుక్మాంగదాదిభక్తాగ్రగణ్యులును సాక్షులగుచున్నారు. మున్యాశ్రమంబుల సహజవైరంబుల మాని సకల జంతువులును నొకేమార్గంబునఁ జరియించినవి. రుక్మాంగదుని భక్తిప్రభావంబున సమవర్తికి నిరుద్యోగ చక్రవర్తిత్వము సంప్రాప్తించినది. ఇట్టివి యెన్నియేనియు భక్త ప్రభావంబునకుదాహరణంబులుగఁ గాననగును. భగవంతుఁ డెల్లప్పు డిట్టి భక్తుల యాధీనములో నుండి వారాడించిన ట్లాడుచుండును. ఇదియే వినుతింపఁ దగిన దివ్యప్రభావము.

## ౧౦ తుదివాక్యము.

ప్రస్తుతాంశమును గూర్చి శక్తివంచనలేని విచారణము జరిగినది. కాని ప్రస్తుతాంశసారాంశము మాత్రము మిగిలి

యున్నది. దీనియందుఁదెలిసికొనవలసిన విషయములు పెక్కులున్నవి. తొలుఁదొల్త భక్తిమార్గము నవలంబించువాఁడు, శాస్త్రీకర్మలను, సంఘాచారంబులను నెడఁబాయ వలయునా? ఇదియొక నిగూఢసమస్య. పైని తెలుపంబడిన భక్తియొక్కనిరోధస్వభావమునుగూర్చి మానవుఁడైనవాఁ డెన్నఁడును సమస్తకర్మలను బూర్తిగ వదలి వైచుటయేయని తలంపఁగూడదు. నిర్మలమగు ముకురంబు నందే ప్రతిబింబము స్వచ్ఛముగ గోచరించునట్లు పరిశుద్ధ చిత్తమునందే యీశ్వరస్వరూపము దృగ్గోచర మగుచున్నది. ఇట్టి పరిశుద్ధ చిత్త మేర్పడుటకుఁ దొలుఁదొల్త సత్కర్మల నాచరించుట ముఖ్యావశ్యకము. రెండియు, శాస్త్రవిధులును భగవద్భక్తియుఁ బరస్పరము మెలివేసికొని యుండుటవలన నయ్యవి భక్తియొక్క క్రమాభివృద్ధికి నావశ్యకము లగుచున్నవి. కావున సర్వజనులకు భక్తితోఁబాటు శాస్త్రకర్మలను, సద్విధులను ననుసరించి, తదాచరణమున మెలంగుట శ్రేయోమార్గము.

'భవతు నిశ్చయదార్ఢ్యా దూర్ధ్వం శాస్త్రరక్షణం'

భగవంతునియందు నిశ్చలభక్తి దృఢపడునంతవఱకును దృఢపడిన పిమ్మటను శాస్త్రవిధుల ననుసరింప వలయును. సకామియగు భక్తుఁడు భక్త్యుద్రేకమును బొందునంతవఱకు శాస్త్రవిధుల ననుసరింప వలయునని భక్తిరసామృతసింధువు

పలుకుచున్నది. భక్తియొక్క ప్రథమావస్థలో నాత్మాభి వృద్ధి లభ్యముకానిది సద్విధా చరణమును వీడఁ గూడదు. తల్లభ్యమునకు మాధ్యమిక వస్తువుయొక్క యావశ్యకత స్పష్టముగాఁ గనుపట్టు చున్నది. తన్నిరాకరణంబు వలన నహం బ్రహ్మాత్వము గానవచ్చు చున్నది. అహంబ్రహ్మాత్వము భక్తిమార్గమున కాటంకమని యిదివఱకే తెలియ వచ్చినది. కావున—

'అన్యథా పాతిత్య శంకయా'

ఇతరము వలనఁ బడిపోవుట కలుగునేమో యని శంక గలుగుచున్నది. శాస్త్రవిధ్యాచరణ నిరాకరణ కారణంబున స్వాతంత్ర్య మలవడుచున్నది. తన్మూలమునఁ గాపథ వర్తన మమరునేమో యని శంక వొడముచున్నది. కావున సంఘమర్యాదలను, శాస్త్రవిధులను, నిశ్చల భక్తి యేర్పడు నంతవఱకు ననుసరింపవలయును. ఈ శాస్త్రవిధ్యాచరణ పరిపూర్ణజ్ఞాన గ్రహణశక్తి యేర్పడుటకు బ్రతిజీవుని యందున్న సహజ దైవిక చైతన్యమును—ఈశ్వరునకు మానవునకుఁ గల ప్రకృతి సంబంధమును—బోధించు వేదాంతశాస్త్ర మున నము మూలాధార మగుచున్నది. ఇట్టి సంపూర్ణజ్ఞానాభ్యుదయంబు వలన దైవిక విశ్వాసము దృఢపడిన యనంతరము, శాస్త్రవిధ్యాచరణముఁ బరిత్యజించినను, నెట్టి ప్రమాద

ముండదు. కావునఁ బ్రతిజీవుఁడు భక్తిమార్గమున నడచుచు న్నను సకల శాస్త్రి సద్విధ సంఘాచార స్వకర్మానుకూల పథానువర్తనమును దవిలియుండుటయే శ్రేయము. ఇప్పటికీ విచారణంబు వలనఁ బ్రథమ సంశయ నివారణమైనది.

ఈభక్తిమార్గంబున నింకొక సందేహంబు వొడము చున్నది. అయ్యది భక్తిమార్గానుసంధానంబునకు సంసార పరిత్యాగ మొనర్పవలయునా? అనునదియే. ఇది యొక విషమ సందేహము. కాని సాధారణము. సంసారులు గొందఱు నిజకుటుంబ పోషణపారవశ్యంబున స్వకీయ పరకీయ భిన్న భావంబునఁజేసి, యధోముఖులు గావచ్చును. కాని యియ్యది యందఱియెడలను జెల్లనేరదు. ముందు భక్తి కుదురుటకు ముఖ్యముగా వలయునది నిశ్చలస్వాంతము. ఈ నిశ్చలస్వాం తము నీశ్వరునిపై నిల్పినప్పుడే భక్తి పుట్టుచున్నది.ఇట్టి నిశ్చల స్వాంతమే లేకున్న నైహిక సుఖవాంఛావిముఖులై, కేవల వానప్రస్థాశ్రమ స్వీకృతులగు వారలకేనియు, భక్తి మార్గాను వర్తనము సంధిల్లనేరదు. ఇట్టి నిశ్చలచిత్తమేయున్న దారా పుత్రాది బంధములఁ దగుల్కొనియున్న సంసారులకేనియు, భక్తిమార్గాను వర్తనము సుకరమగుచున్నది. సంసారులైనంత మాత్రమున నందఱికి నధోగతి సంభవించుచున్నదా? అంత మాత్రముననే యందఱును విషయాసక్తులై భగవంతుని

మఱచుచున్నారా? పురువులన్నియు బురదలో దూరినంత మాత్రమున నన్నిఁటికిని బురద యంటుచున్నదా? కుమ్మరి పురువున కేమిబురద యంటుచున్నదో విచారింపుఁడు? అట్లే సంసారము నుండియేనియు భ_క్తిమార్గాటులు గావచ్చును. ఇంకను శ్రీకృష్ణభగవానుని యు_త్తమాభిప్రాయంబు ననుసరించినఁ బురుషునకుఁ బైదానియందుఁ దెలుపఁబడినట్లు గర్మ ప్రధాన మగుటయేగాక సంసారమున నుండవలయుననియే నిరూపింపఁబడుచున్నది.

యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యం కార్యమేవ తత్
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్
ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ
క_ర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మత ము_త్తమమ్.

భగవద్గీత ౧౮ అధ్యా.

పురుషుఁడు యజ్ఞదానతపోరూపమయిన కర్మ యవశ్యము సేయఁదగినది. అదివిడువఁదగినదికాదు. కారణ మేమన యజ్ఞదానతపములు పండితులకుఁ బవిత్రములైనవి. కాని వీనిని ఫలకాంక్షలు విడిచిపెట్టి చేయవలయును. ఇదియే భగవంతుని యు_త్తమాభిప్రాయము. కావునఁ గర్మాచరణమునకు సంసారమున నుండవలసి వచ్చుచున్నది. అందువలన దీనికి సంసార పరిత్యాగము తగనిది యగుచున్నది.

సందేహములు సెల్లిపోయినవి. ఇంకను విచారింపఁబడ వలసిన విషయంబులున్నవి. భక్తిమార్గంబు నవలంబించినఁ గలుగు ఫలమేమి? ఫల మేదేనియుఁ గలుగనున్నచో, నయ్యది తదవలంబకున కేగాక లోకమున కేమేని యుపయోగపడునా? ఇది విచారింపవలసిన విషయమే. అగుచో భక్తిమార్గము జీవుని నెచ్చోటికిఁ గొంపోవును? దాని సంకేతస్థాన మెయ్యది? ఈభక్తిమార్గము తన్ననుసరించిన జీవుని ముక్తిసామ్రాజ్యము నకుఁ గొనిపోవుచున్నది. ఇదియే దీని సంకేతస్థానము. ఇదియే దీనివలనఁ గలుగు ఫలము. ఇతర మార్గములెవ్వియును ముక్తి సామ్రాజ్యమునకుఁ గొంపోవుటకు సులభమార్గములు గాఁజా లవు.

'అన్యస్మాత్ సౌలభ్యంభక్తౌ'

ముక్తికి భక్తిమార్గమే యన్నింటికన్న సులభము. కర్మజ్ఞాన రాజయోగ మార్గములు ముక్తిసామ్రాజ్యమునకు నేరుగాఁ గొనిపోవక భగవత్ జ్ఞానభక్తులు లభించుటకుఁ దోడుపడును. భక్తిమార్గ మట్టిదిగాదు.

'మోక్షసాధన సామగ్ర్యాం
భక్తిరేవ గరీయసీ'

మోక్షసంపాదనకు భక్తియే మూలసాధనమని శంకరుని మతము. కావున దీనివలనఁ గలుగు ఫలము ముక్తి. ముక్తి యనఁగా సంసారబంధవిముక్తి. ఇట్టి ముక్తునివలన లోకోపకారమేమైన జరుగఁగలదా? ఏతద్విచారణమునకు ముందు ముక్తుఁడన నెవ్వఁడో తెలిసికొందము.

యో వివిక్తం స్థానం సేవతే. యో లోకబన్ధ మున్మూలయతి
నిస్త్రైగుణ్యో భవతి. యో యోగక్షేమం త్యజతి.
యః కర్మ ఫలం త్యజతి. కర్మాణి సంన్యస్యతి.
తతో నిర్ద్వంద్వో భవతి. యో వేదానపి సంన్యస్యతి.
కేవల మవిచ్ఛిన్నానురాగం లభతే.

ఏకాంతస్థానము నభిలషించువాఁడును, భవబంధరహితుఁడును, త్రిగుణముల కతీతుఁడును, దనసర్వస్వ మీశ్వరున కర్పించువాఁడును, దనకర్మలకుఁ బ్రతిఫలమునే కాక కర్మలను గూడ వదలి సుఖమునకు దుఃఖమునకు మేలునకుఁ గీడునకుఁ జలికి, వేడికి, నతీతుఁడును, శాస్త్రములను వీడినను కేవల మవిచ్ఛిన్న రాగంబున నీశ్వరునే శరణు బొంది సర్వదా యాతని నే ధ్యానించువాఁడును, ముక్తుఁడనఁబడు చున్నాఁడు. ముక్తుని లక్షణమిదియే. ఈలక్షణముల వలన ముక్తునకుఁ గలిగెడి ఫలమెట్టిదియో తెలియుచునే యున్నది. కాని యిట్టి ముక్తుని వలన లోకమున కేమేని మేలుగలుగునా?

స తరతి స తరతి లోకాంస్తారయతి.

ఇట్టి ముక్తుఁడు తాను తరించుటయేగాక, లోకమును గూడఁ దరింపఁజేయుచున్నాఁడు. దీనికి రుక్మాంగదుని నొక్క పరి స్మరింపుఁడు. తాను తరించినాఁడు. తనమూలమున నిజ రాజ్యములోని జనులనేగాక చతుష్పాద జంతువులను గూడఁ దరింపజేసినాఁడు. ఇదియే ముక్తునిమూలమున భక్తిమార్గంబు నవలంబించినఁ గలిగెడి ఫలము.

కర్తవ్యాంశ విచారణమంతయు ముగిసినది. భక్తిమార్గ ప్రభావాదు లన్నియుఁ దెలియవచ్చినవి. తత్ప్రభావంబున భక్తుఁడు, భగవంతుఁడును, నేకస్వరూపులగుచున్నారు. కాని ప్రస్తుత స్థితియందీ భక్తిమార్గము స్వప్రభావరహితమట్లు మెలంగుచున్నది. తద్గౌరవము తదనుష్ఠానము మున్నగునవి చాలవఱ కడుగంటినవి.

« లోకో భిన్నరుచిః »

లోకము భిన్నరుచులు గలది. ద్రాక్షపండు పుల్లన, అని యన్నంతమాత్రమున దానియందుండు మాధుర్యము నకు లోపము గలుగునా? మండూకము కమలాకరంబునఁ బెద్దకాలంబు వసించియు సరసిజ సౌరభ్యమును గురుతింపనేర

నట్లు మానవులు జ్ఞానులయ్యు భక్తిమార్గమును గురుతింప నేర కుండిరి. కొందఱు కేవల మిదియంతయు బూటకమని వాదించుటయుఁ గలదు. పండొలిచి చేతియందుఁ బెట్టినను దిననేరనప్పు డెవ్వరేమి సేయఁగలరు? ఇది కాలమహిమ. అయిననేమి?

‘ త్రిసత్యస్య భక్తిరేవ గరీయసీ భక్తిరేవ గరీయసీ,

భూతభవిష్యద్వర్తమానములయందును భక్తియే యుత్కృష్టమైనదని చాటెదను. ఈశ్వరునివలె నిత్యమైనదని బోధించెదను. ఇది యంతయు మిథ్యగాదని నిరూపించెదను. విశ్వము భక్త్యధీన మగుఁగాక!

శ్రీ భక్త్యార్పణమస్తు.



# భాష — వ్యాకరణము.

(౧౦—౩—౧౯౩౦.)

భాష యన నేమి? తొలుదొల్త నయ్యది మానవున కెట్లు లభించినది? ఈవిషయములు మనకుఁ బ్రస్తుతము విచారణీయాంశములు. భాష యనునది మానవునకు విలక్షణమగు సొత్తు. ఈ భాషవలననే మానవుఁడు పశుపక్ష్యాదులనుండి వేఱగుచున్నాఁడు. ఇది ద్వివిధము. మొదటిది సంజ్ఞామూలకము. రెండవది ధ్వన్యాత్మకము. సంజ్ఞామూలకమగునది ముఖవికారములపైనను, నంగవిక్షేపాదులపైనను, నాధారపడి యున్నది. ఇంక ధ్వన్యాత్మకమన్ననో, సూక్ష్మభావములను వ్యక్తమొనర్చునదియుఁ బరిస్ఫుటాక్షరసహితోచ్చారణంబు గలదియు నై యున్నది. ధ్వన్యాత్మకమునందును, ముఖ వికారములును, నంగవిక్షేపాదులును నిలిచియున్నవి. అందువలన ధ్వన్యాత్మకమునకంటె సంజ్ఞామూలకమగునదియే ప్రాచీనమైన దని తలంపఁ దగియున్నది. మనము సేయు ధ్వను లన్నియు భాషక్రిందికి రాఁజాలవు. ఈ ధ్వనులకు నుద్దిష్టములగు భావము లేర్పడుటయగాక, యాభావముల నితరులకు గ్రాహ్యము లగునట్లొనర్చు శక్తి యెప్పుడు గలుగునో, యప్పుడే యవి యవ్య

క్తములగు ధ్వనులు (Inarticulate sounds) గాక, వ్యక్తము లగు ధ్వనులై భాషగామాఱుచున్నవి. ఈధ్వనులకు మానవుఁ డెప్పుడిట్టి శక్తినిఁ గలిగించుకొనుచున్నాఁడో, యప్పటినుండియు నాతనికి భాషయనునది యలవడుచున్నది. ఇదియే భాషను గూర్చి యెఱుంగవలసినది.

ఇట్టిభాష మానవునకుఁ దొలుఁదొల్త నెట్లేర్పడినది? ఈ విషయమును గూర్చి పెక్కువాదములు బయలు దేరి యున్నవి. ఈవాదము లన్నియు, భాషోత్పత్తిక్రమమును గూర్చినవియే కాని, భాష మానవున కెట్లేర్పడినది యను విషయమును గూర్చినవికావు. కొందఱు మానవునకు భాష స్వతస్సిద్ధముగా నేర్పడినదని చెప్పుదురు. కాని యిది యంగీక రింపఁ దగినదికాదు. భాష యెన్నఁడును మానవునకు స్వత స్సిద్ధము గానేరదు. భాష స్వతస్సిద్ధమే యైనయెడల నొక యాంధ్రబాలుని శైశవమునందే విదేశమునకుఁ గొనిపోయి యచ్చోట నుంచినప్పటికి, నాతఁ డాంధ్రమునే మాటలాడ వలయును. కాని యిట్లు జరుగుటలేదు. ఇందువలన భాష మానవునకు స్వతస్సిద్ధముగాదని యూహింపఁదగుచున్నది. కొందఱు మానవున కిది పరంపరానుగత మనియు (Traditional) సంఘ బద్ధమనియు, (Social) నుడువుదురు. ఇయ్యది నిజము. ఒక్కని వలన భాష యనునది యెంతమాత్రమును బుట్టఁజాలదు. తుద

కిర్వ్వ రేనియు నుండితీరవలయును. ఇట్లు ఎప్పు డుండురో యప్పుడే సంఘ మేర్పడుచున్నది. అందువలన భాషసంఘబద్ధ మగుచున్నది. ఇంకఁ బరంపరానుగతమనుటకు వృద్ధవ్యవహా రానుకరణము సహాయభూత మగుచున్నది. వృద్ధవ్యవహారాను కరణము లేనిదే భాష మానవున కలవడఁ జాలదు. ఇందుకు నిదర్శనము—బాలుఁడు తన తల్లిదండ్రులవలననో, లేక పరి సరవర్తులగు వారివలననో, మాటలను నేర్చికొనుచున్నాఁడు గాని తనకుఁ దాను నేర్చికొనుటలేదు. కావున నిది పరంప రానుగత మగుచున్నది.

మానవునకు భాష యేర్పడుటకు ముఖ్యములగు సాధ నములు నాలుగు. మొదటిది సంఘము. రెండవది వృద్ధవ్యవ హారానుకరణము. మూఁడవది సుఖదుఃఖాద్యనుభవావిష్క రణము. నాల్గవది సంకేతము. ఈనాలుగింటి వలననే భాష యనునది యేర్పడుచున్నది. భాషోత్పత్తిక్రమమును గూర్చి పుట్టినవి—ఇవిగాక—ఇతరములగు వాదములన్నియు నసమం జసములుగావని నాయభిప్రాయము.

౨

భాష యనునది తొలుఁద్రొల్త నీ విధముగా నేర్పడి యున్నది. ఇట్లేర్పడిన భాషవలనఁ గాలక్రమము ననుసరించి

వివిధ భాషలు వ్యవహారములోనికి వచ్చి యున్నవి. ప్రస్తుతము మన దేశమున నిత్యవ్యవహారములో నున్న భాషలన్నియు ముఖ్యముగా రెండు భాషాకుటుంబములకుఁ జెంది యున్నవి. అందు దక్షిణదేశపు భాషలన్నియు ద్రావిడ భాషా కుటుంబమునకుఁ జెందియున్నవి. ప్రపంచము నందున్న వివిధభాషల యందును, వివిధములగు భాషాసారస్వతములు వృద్ధినొంది యున్నవి. ఈ సారస్వతాభివృద్ధికిఁ గవులు కారకులై యున్నారు. ఈ కవులు భాషను సంస్కరించియున్నారు. సంస్కరణమునకు వ్యాకరణము మూలము. కాని యిక్కడొక గొప్పచిక్కు గలదు. అది యెద్దియన, భాషకు మూలము వ్యాకరణమా? లేక వ్యాకరణమునకు భాషయే మూలమా? అనునది. ఈ విషయమున నెన్నియేనియు భిన్నాభిప్రాయములు బయలుదేరి యున్నవి. కొందఱు వ్యాకరణము లేనిదే భాష యెక్కడిది యని వాదించియున్నారు. మఱికొందఱు మొదట భాషలేనిదే వ్యాకరణమునకుఁ దావెక్కడఁ గలదని వాదించి యున్నారు. కాని యిందు సరియైనదేది? వైయాకరణులు దమ వాదమును గూర్చి యిట్లు సెప్పెదరు.—

తొలుఁదొల్త నిత్యవ్యవహారమున లేకుండియు ధాతువులు భాషోత్పత్తి కెట్లు మూలములైనవో, యట్లే వ్యాకరణము గూడ భాష నాధారము సేసికొని యున్నను, భాషాసారస్వతమునకును భాషా సజీవత్వమునకును, మూలాధార మగు

చున్నది. ఇది వీరి వాదము. ఇంక భాషయే మూలమనువారి వాదము నెత్తికొందము. వారిట్లు చెప్పుచున్నారు.—వ్యాకరణము ప్రయోగశరణ్యము. ప్రయోగము శబ్దశరణ్యము. శబ్దము భాషాశరణ్యము. కావున వ్యాకరణము భాషాశరణ్యము. ఈవాదము సమంజసము. కారణమేమన, వ్యాకరణము లేకుండ భాషాసారస్వత మొకవేళ నుండకపోవచ్చును గాని, భాషమాత్ర ముండితీరును. ఇందుకు నిదర్శనంబుగ సారస్వతము లేనివి యాఱుభాషలు మన ద్రావిడభాషాకుటుంబమునఁ గాన్పించు చున్నవి. వైయాకరణుల యభిప్రాయము గూడ నిదియే యై యుండవచ్చును.

ఇవ్విధముగ భాషావ్యాకరణముల పరస్పరసంబంధమును గూర్చి వాదోపవాదములు జరుగుచున్నవి. ఇదమిత్థమని నేను నిర్ణయింపఁజాలను. కాని మనవారందఱు నీ విషయమునఁ బొరపాటు పడుచున్నారని మాత్రము తలంచెదను. ఏలయన భాషావ్యాకరణముల సంబంధమొక్క నాటిదిగాదు. ఇంతవఱకని నిర్ధారింపఁ బడునదియుఁ గాదు. వ్యాకరణమెప్పుడును భాషనంటియే యుండును. భాషయు నట్లే. కొన్నియెడల భాషకును వ్యాకరణమునకు సంబంధము దూరము గావచ్చును. అప్పుడు వ్యాకరణము వెంటనే తన మార్గమును మార్చుకొని తిరిగి భాషతో సంబంధమును గలిగించుకొను

చున్నది. భాష యెన్నండును వ్యాకరణముపై నాధారపడి యుండదు. ఇక్కడ భాషయనఁగా వ్యవహారచ్యుతముగాని భాషయని నా యభిప్రాయము. భాషా ప్రవాహమునకు వ్యాకరణము గట్టువంటిది. ఎచ్చటనేనియు ప్రవాహము ననుసరించియే గట్టేర్పడునుగాని, గట్టుననుసరించి ప్రవాహ ముండఁజాలదు. ప్రవాహమున కభివృద్ధి యెట్లు సహజమో భాషకును నభివృద్ధి యట్లే సహజమగుచున్నది. గట్టుండెఁ గదా యని ప్రవాహము సన్నగిలనట్లు, భాషయు వ్యాకరణ ముండెఁ గదా యని సంకుచితము గానేరదు. భాషకు వ్యాకరణమే శరణ్య మను మాట యెంత మాత్ర మంగీకరింపఁ దగినది కాదు. సారస్వత పోషకులగు కవులు నిరంకుశాధికారులు. కవులు దమ యిచ్చవచ్చినట్లు వ్యవహారస్థమగు భాషను బ్రయోగింతురు. వ్యాకరణము వారి కెన్నండును బ్రమాణము గాదు. వారి ప్రయోగములే వ్యాకరణమునకుఁ బ్రమాణములు. కావుననే వ్యాకరణము ప్రయోగశరణ్య మగుచున్నది. ఇట్టిది భాషావ్యాకరణముల పరస్పర సంబంధము. ఇయ్యది యవిచ్ఛిన్న మని నా తలంపు. ఇంక నీవిషయమును గట్టిపెట్టి, వ్యాకరణమన నేమియో, యది యెన్నివిధములలో, భాష కంతటికిఁ బనికివచ్చునట్లు వ్యాకరణమును రచింప వలెనన్నఁ దదీయ రచనావిధాన మెట్లుండవలయునో మున్నగు విషయములఁ గూర్చి విచారించుదము.

వ్యాకరణమననేమి? అది యెన్నివిధములు? అను విషయములఁ గూర్చి ముందు విచారింతము. వ్యాకరణమనఁగా భాషకు లక్షణమును గల్పించి పదముల సాధుత్వాసాధుత్వములను నిర్ణయించునది. ఇది మూఁడువిధములు. మొదటిది కాల్పనికవ్యాకరణము (Descriptive Grammar). కాల్పనికవ్యాకరణ మనఁగాఁ బదములయొక్క యున్న రూపములు నున్నట్లు దీసికొని వానియందున్న విశేషగుణములను, సంబంధమును భిన్నత్వములను నిర్ణయించునది. ఇట్టి వ్యాకరణమువలన మాండలీయకము లెయ్యవియో, యవి యెట్లేర్పడినవో, వానిఁ బ్రయోగించినవా రెవ్వరో, మున్నగు విషయము లన్నియుఁ జక్కగాఁ దెలియఁగలవు. మాండలీయాకములన నిట్లుండును.

ఎలిక; ఎలుక; ఎలక.
గరిటె; గంటె; గంటె.
కోరిక; కోరికి; కోరికె.

ఇట్టి మాండలీయకభేదములఁ గనుంగొనుటకుఁ గొంతవఱకుఁ గవుల గ్రంథము లాధారములు గానచ్చును. అవి యాధారములు గానప్పు డామామండలములలోని నిత్యవ్యవహార

మాధారముగావచ్చును. ఈవిధముగాఁ గాల్పనిక వ్యాకరణము మాండలీయకముల గుర్తింపవలయును. రెండవది యిట్లు పరిశోధన మూలమునఁ గనుఁగొనుటకంటె నే మండలములోని వార లాయా మండలములందలి ప్రయోగములనన్నింటిని గైకొని, యున్నది యున్నట్లు రచించినచో నిట్టిది మిక్కిలి సులభముగ సాధ్యపడును. వైయాకరణులకును, భాషాశాస్త్రాభ్యాసకులకును, భాషాతత్త్వసిద్ధాంతులకును, నిట్టి కాల్పనిక వ్యాకరణములు, మాండలీయకములను, బదముల రూపాంతరములను, దెలిసికొనుట కెంతయు నాధారము లగును. ఇట్టివి మన భాషయం దింకను బుట్టియుండలేదు.

రెండవది చరిత్రాత్మక వ్యాకరణము (Historical Grammar). ఈ వ్యాకరణమువలన భాషాచరిత్రమును సమగ్రముగాఁ దెలిసికొనవచ్చును—అనఁగాఁ బదములయొక్క మార్పులను గూర్చి—ఉదాహరణమునకుఁ గాను 'వద్దు' అను పదమును గైకొనుఁడు. ఈ 'వద్దు' అను పద మిపుడు నిత్య వ్యవహారమున 'ఒద్దు' అని యుచ్చరింపఁ బడుచున్నది. 'నా కొద్దు' అని మన మందుమేకాని 'నాకు వద్దు' అని మనము నిత్యవ్యవహారమున ననము. కావున నీ పదముయొక్క యిప్పటి రూపము 'ఒద్దు' అని తెలియుచున్నది. ఇంక దీని చరిత్రను గూర్చి విచారించుదము. దీనిరూపములు—ఇంకను నిట్టివి కొన్నింటి పదముల రూపములు—

ఒన్ఱు; ఎన్దు; వల్దు; వలదు; వలాదు; వలవదు;
అంఱ్రు; (అంఱ్ఱు) అంఱురు; అనుఱురు; అనెదరు: అనియెదరు;
మంఱ్రు; (మంఱ్ఱు) మంఱురు; మనుఱురు; మనెదరు; మనియెదరు.

ఈవిధముగా విచారించిన నీ పదములయొక్క పూర్వ రూపములు 'వలవదు' 'అనియెదరు' 'మనియెదరు' అని తెలియవచ్చు చున్నవి. ఇట్లే పదములు గాలక్రమము ననుసరించి మారు రూపములను బొందుచున్నవి. చరిత్రాత్మక వ్యాకరణము లున్నచోఁబదములయొక్క యిట్టి మారు రూపములను మనము సులభముగాఁదెలిసికొనఁగలము. ఇంకను జరిత్రాత్మక వ్యాకరణము పదములయొక్క మారు రూపముల కాలమును గూర్చియు, నవి యెందు కట్లు మారినదియు, నామార్పులు మాండలీయకములో, మఱి యెట్టివియో మున్నగు విషయములఁ గూర్చియుఁ జక్కగాఁ దెలుప వలయును. ఇంకను 'భయము' అను పదమునకు—

భయంబు; భయమ్బు; భయబు; భయమ్మ; భయము.

అను రూపము లేర్పడి యున్నవి. ఈ రూపములను బట్టి మన లాక్షణికులు 'భయము' అనునదే మొట్టమొదటి రూప మనియు, బిందువు సంయుక్తము మొదలగునవి తరువాత వచ్చినవే యనియుఁ జెప్పియున్నారు. కాని శాసన

ములఁ బట్టి చూడ, (క్రీ. శ. ౯ వ శతాబ్దమునాటి వగు యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము; గుణగవిజయాది త్యుని శాసనము; ప్రమాణములు) బిందుపూర్వకమగు 'భయంబు' అను రూపమే, మొట్టమొదటి దని తెలియ వచ్చుచున్నది. దీనిఁబట్టి 'గొనబు' అను పదము గూడ 'గుణంబు' అను సంస్కృత పదజన్యమే మోయని యూహింప నగుచున్నది. ఈవిధముగాఁ జరిత్రాత్మక వ్యాకరణమున్న భాషాచరిత్రమును మిక్కిలి సులభముగాఁ దెలిసికొనవచ్చును. ఇట్టివి యింకను బుట్టియుండలేదు.

మూఁడవది తారతమ్య నిర్ణయవ్యాకరణము (Comparative Grammar.) ఈవ్యాకరణము వలన మన భాషకును, దదితర భాషలకును గల సంబంధమును దెలిసికొన వచ్చును. ఇందువలన మన భాషలోని కేయేపదము లితర భాషల నుండి వచ్చినవో, మన భాషనుండి యేయేపదము లితర భాషలలోనికిఁ బోయినవో, యితర భాషలనుండి మన భాష లోనికి వచ్చిన పదముల యొక్క మొదటి రూపము లెట్టివో, మన భాషాపదము లితర భాషలలోనికిఁ బోయి యెట్టి రూప ములను బొందినవో మున్నగు విషయముల నన్నింటిని దెలిసికొనవచ్చును. ఇంకను— భాషలయొక్క పరస్పర సంబంధము వలన నేయే పదము లేయే భాషలయం దెట్టి

రూపములను బొందినవో తెలిసికొన వచ్చును. ఉదాహరణ మునకు—

| సంస్కృతము. | తెనుఁగు. | అరవము. | కన్నడము. |
|---|---|---|---|
| శయ్యా. | సెజ్జ. | | సెజ్జె. |
| పృథ్వీ. | పుడమి. | పుడవి. | |
| వినాయక. | వెనకయ్య. | | |
| తుండ. | తొండము. | తొండై. | |
| భుజంగ. | బొజుగ. | | భొజంగ. |

ఈవ్యాకరణము వలన నిట్టిమార్పులను తెలిసికొన వచ్చును. ఇట్టి మూఁడువిధములగు వ్యాకరణములున్నచో భాషాశాస్త్రనిర్మాణ మనునది మిక్కిలి సులభము. ప్రస్తుతము మన యాంధ్రభాష కిట్టి వ్యాకరణము లావశ్యకములై యున్నవి. ఇప్పుడున్న వ్యాకరణము లన్నవో యిందు కెంత మాత్రమును బనికిరావు. ఉన్నవానియందును స్వతంత్రము లైనవి మిక్కిలి తక్కువ. భాషకంతటికిని వర్తించునవి, యసలు లేనేలేవు.

ఇంక వ్యాకరణరచనావిధానముఁ గూర్చి విచారించు దము. మన వైయాకరణులందఱు మొదటినుండియు నాంధ్రము సంస్కృత జన్యమని భావించి యున్నారు. ఆంధ్ర వైయాకర ణులలో మొదటి వాఁడగు కేతన తన యాంధ్రభాషాభూష ణము నందు—

తల్లిసంస్కృతంబె యెల్లభాషలకును
దానివలనఁగొంత గానఁబడియెఁ
గొంతతానగలిగె నంతయు నేకమై
తెనుఁగు బాస నాఁగ వినుతికెక్కె.

అని చెప్పియున్నాఁడు. ఇట్లు దెనుఁగును సంస్కృత జన్యమని భావించుటయగాక దాని కనాదిత్వమును గట్టిపెట్టఁ దలంచి తదీయ లక్షణమును (Grammar) బృహస్పతి, కణ్వుఁడు, పుష్పదంతుఁడు, రావణుఁడు మొదలగువారు రచించిరనియుఁ జెప్పుచున్నారు. వెండియు నాంధ్రకౌముది మొదలగు గ్రంథముల నాధారములు సేసికొని యీ యనాది త్వము సత్యమని నిరూపించుచున్నారు. ఇట్లగుటవలన మన వైయాకరణులుఁ దెనుఁగు వ్యాకరణరచనా విధానమునందు సంస్కృత వ్యాకరణరచనావిధానమునే యనుసరించినారు.

ఙ్ఞననుసరించుటఁజేసి సంస్కృతములోని సంజ్ఞలును, ప్రత్యాహారములును, నాదేశములును, పరిభాషలును, సూత్రరచనాపద్ధతియుఁ దెనుఁగు నందనుసరింపఁబడినవి. ఈ యనుసరణము వలనఁ దెనుఁగు వ్యాకరణరచనావిధాన మడుగంటిపోయినది. ఆంధ్రవ్యాకరణము సంస్కృత వ్యాకరణ మైనది.

తెనుఁగున కనాదిత్వమును గట్టిపెట్టిన వారగుటవలన దానికి లక్షణము నేర్పఱచుట యందు మన వైయాకరణులు మిక్కిలి ప్రాచీనగ్రంథములకే ప్రామాణికత్వము నొసంగియున్నారు. ఆధునిక గ్రంథములలోని విశేష ప్రయోగములను బ్రామాదికములని త్రోసి వేయ సాహసించినారు. భాషకు లక్షణమును గల్పించుటకు ముందు మన వైయాకరణులు చేతనగునంతవఱకు భాషను సంకుచితపఱచి భాషాప్రవాహమును నరికట్టియున్నారు. ఆంధ్రభాష కంతకును బనికివచ్చు లక్షణగ్రంథము లేక పోవుట కిదియొక మూలకారణము. ఈ విధముగా భాషా ప్రవాహము నరికట్టి మన లాక్షణికులు కవిత్రయమువారి ప్రయోగములకే—అందు నన్నయ ప్రయోగములకే ప్రామాణికత్వమును గట్టిపెట్టినారు. భాస్కరుఁడు, శ్రీనాథుఁడు, పోతన మున్నగు కవిపుంగవుల ప్రయోగములను లక్షణవిరుద్ధములని త్రోసివేసినారు. ఇట్లొనర్చుటకుఁ గారణము లెవ్వియో? వీరియందు దుష్ప్రయోగము

లున్నవనియేగదా మనము భావింపవలసినది? అగుచో నవి యెట్టివి? భాస్కరుని రామాయణమునందు—

'రామాయణముగ రచించి ప్రాచేతసుకుఁ'

అను నొక ప్రయోగము గాన వచ్చుచున్నది. ఇయ్యది 'నఃక్త్వో' అను సూత్రంబువలన లక్షణ విరుద్ధమగు చున్నది. ఈ సూత్రము ననుసరించి 'ప్రాచేతసునకుఁ' అని యుండవలయును. అనఁగా నిట్టిచోట్ల 'న' గాగమమురావల యును. కాని కాలక్రమమున నియ్యది మారిపోవుట వలనఁ గొన్నియెడల 'న' గాగమము లోపించుచు వచ్చినది. ఇట్టి ప్రయోగము లుత్తరాంధ్రకవుల యందును గానవచ్చు చున్నవి. తెనాలి రామకృష్ణకవి విరచిత మగు పాండురంగ మాహాత్మ్యమున—

'తతమనస్సరసి సంతత చిదానంద మై
భవమరాళము కున్కిపట్టనంగ'

అ. ౫. ప. ౫౪.

అని యున్నది. ఇక్కడ 'మరాళము కున్కిపట్టనంగ (మరాళముకు+ఉన్కిపట్టనంగ) అను చోటఁ బై సూత్రము ననుసరించి 'మరాళమున కున్కిపట్టనంగ' అని యుండవలెను. ఇట్లు 'న' గాగమము లోపించుటవలన నథర్వణుఁడు—

సర్వేషామేవచోదంత శబ్దానాంకాపరేఫవేత్
నఃప్రాయస్స్యాత్ప్రమాకారశ్చ । సర్వపండితసమ్మతే

అని 'న' గాగమమునకుఁ బ్రాయస్త్వమును గల్పించి యిట్టి ప్రయోగములకు గతిని గల్పించి యున్నాఁడు. ఇట్టి యెడ నీప్రయోగములు లక్షణవిరుద్ధము లెట్లగును? శ్రీనాథుని యందిట్టి ప్రయోగములంతగాఁ గానరావు. ఇఁకఁ బోతన నప్రమాణీకుఁడనుటకు ముఖ్యములైనవి రెండుకారణములు. మొదటిది లఘురేఫములకును శకట రేఫములకును యతిప్రాసలను గూర్చినాఁడనుట. రెండవది దు్రతంబుమీఁది యచ్చునకు సంధిని ఘటించినాఁడనుట. మన వైయాకరణులిందు మాత్రము తమ యవివేకమునుజక్కఁగా వెల్లడించియున్నారు. ఎట్లందురా? చిన్నయసూరి మొదలగు వైయాకరణు లెవరిప్రయోగములకుఁబ్రమాణికత్వమును గట్టిపెట్టి వ్యాకరణములను రచించియున్నారో, యట్టివారియందే పైనఁ బేర్కొనఁబడిన రెండువిధములగు ప్రయోగములును గానవచ్చుచున్నవి. తిరుపతి వేంకటకవులు—

> ఆకును రేఫకు న్వళియుఁ
> బ్రాసయుఁ జెల్లదటంచుఁజెప్పి తా
> నేకరణిన్ ఘటించెను? గ
> విం ప్రముఁడు నన్నయ

అని చెప్పియున్నారు.

ఉదా॥ ఱేయి వచ్చెదనని - ఱేపు వచ్చు
ఆరణ్యపర్వము.

ఱేకులన్నియు విచ్చి - ఱేయెండ జిగినిండ,
భాస్కర రామాయణము.

ఱేఖలై మీఁదటి - ఱెప్పలయొప్పు
తిక్కనసోమయాజి.

ఇందువలన లఘు రేఫ శకట రేఫములఁ గూర్చిన యంశము విచారణీయ మగుచున్నది. ఇఁక రెండవదానిఁ గూర్చి చూడుడు—

అన్నేటి (అన్ + ఏటి) ఆది. అ ౧. ప ౭౯.
అన్నిష్టసఖి (అన్ + ఇష్టసఖి) ఆది. అ ౩. ప ౧౪౦.
అన్నసుర (అన్ + అసుర) ఆది. ఆ ౫. ప ౩.
శక్తికిన్నసమగ (శక్తికిన్ + అసమగ) అరణ్యపర్వము.

ఇట్లు ద్రుతంబుమీఁది యచ్చునకు సంధియైన ప్రయోగంబులు నన్నయ యందేగాక, నన్నయ తరువాతివాఁడును, పోతనకంటెఁ బ్రాచీనుఁడును నగు మల్లికార్జున పండితారాధ్యుని శివతత్త్వసారమునందు—

క. ఒందేమి...యతని
న్నొందఁగఁ జనముక్తి। యోగమునశివా!
శివతత్త్వ. ప ౨౧౯.

అనియుఁ గానవచ్చుచున్నది. ఇంకను లఘు రేఫ శకట రేఫములఁగూర్చిన యంశమున నీశివతత్త్వసారమునందు—

క. ............
మఱి పింఛమూఁడు వెట్టిన
మెరయల క్రియ...... ప. ౧౯౭.

క. మఱివిను......
గురియించ నె......
కరికాలచోళనృప॥
గురుభక్తికి.........

అని లఘు రేఫ శకట రేఫములకుఁ బ్రాస చెల్లింపఁబడినది. పోతనకంటెఁ బ్రాచీనులగువారే యిట్టి ప్రయోగములఁ జూపించియున్నప్పుడు పోతన ప్రయోగించుటలోఁ దప్పేమి గలదు? వారివి లక్షణసమ్మతము లగు టెట్లు? పోతనవి లక్షణ విరుద్ధము లగు టెట్లు? మీరే విచారింపుడు.

ఉత్తమ ప్రామాణికత్వమును గట్టి పెట్టిన నన్నయగారి ప్రయోగము లిట్లున్నవి. ఇఁకఁ దిక్కనగారి ప్రయోగములను గూర్చి విచారింతము.

'తెనుఁగులమీఁది సాంస్కృతిక పరుషములపై గసడదవలు రావు'
బాల సంధి. సూ. ౧౪

అని చిన్నయసూరిగారు ఖండితముగాఁ జెప్పియుండఁ దిక్కనగారు దీనికి వ్యతిరేకముగా నున్నారు—

,,ఎం, త గు మతులైన మార్తురే? ...''

అను దానియందు గసడదవాదేశము గానవచ్చు చున్నది. ఒక తిక్కనియందేగాక, క్రీ. శ. ౧౩ వ శతాబ్దారంభమునాటి దగు ఓపిలిసిద్ధి చోడరాజు కొణిదెన శాసనము నందును—

,తమ్ముండు ప్రతాపమునం జని'

అను దానియందు గసడదవాదేశము గానవచ్చు చున్నది. ఈవిధముగా లక్ష్యలక్షణములు వేఱుగా నున్నవి. ఎవరికిఁ బ్రామాణికత్వమును గట్టిపెట్టిరో, యట్టివారి ప్రయోగములే లక్షణవిరుద్ధము లగుచున్నవి. దీని కేమి సెప్పవలయునో తెలియకున్నది.

ఇట్లున్నది మనలాక్షణికుల మతము. ఇందువలననే సరియైన వ్యాకరణరచనావిధాన మడుగంటిపోయినది. సరియయిన వ్యాకరణరచనావిధాన మిట్లుండవలయును-లక్షణమును గల్పించునప్పుడు భాష నెంతమాత్రమును సంకుచిత పఱుపరాదు, భాషాప్రవాహము నరికట్టఁగూడదు. కవిత్రి

యమువారికే- అందు నన్నయ కొక్కనికే ప్రామాణికత్వ
మును గట్టిపెట్టఁగూడదు. ఒక్క నన్నయభారతభాగమునందే భాషయంతయు నిమిడియుండలేదు. ఒక్క కవిత్రియమువారి ప్రయోగములే భాష కంతటికిని లక్ష్యములు గాఁజాలవు. ఉన్న కవుల నందఱిని బ్రామాణికులఁగాఁ గైకొనవలయును. వారి ప్రయోగముల నన్నింటిని జక్కగా గమనింపవలయును. ప్రాచీనులయందును, నాధునికులయందును భిన్నప్రయోగములును, భిన్నరూపములగు పదములును, గాన్పించినయెడల నవన్నియు భాషయొక్క మార్పు ననుసరించి వచ్చిన వని భావింపవలయును. మనది జీవద్భాష. జీవద్భాషలు గాలక్రమము ననుసరించి మారుచుండును. మారుటయే వీనికి ముఖ్యమగు లక్షణము. ఆమార్పులకుఁగూడ లక్షణమును గల్పింపవలయును గాని లక్షణవిరుద్ధములని యెంతమాత్రమును వానిఁ ద్రోసివేయరాదు. పదములను బట్టియే లక్షణము గలుగుచున్నదికాని, లక్షణమునుబట్టి పదములు గలుగుట లేదు. కవులు నిరంకుశాధికారులు. రచనాసౌష్టవము కొఱకు వారు గొన్నియెడలఁ బదములను మార్చుకొందురు. ఆమార్పులు లక్షణ విరుద్ధములు గావచ్చును. అయినను నట్టివి ప్రామాణికములుగాని ప్రామాదికములుగావు. భాషమారు కొలంది లక్షణముగూడ మారవలయును. అట్లు మారుటయే

గాక భాషలోఁ జూపట్టు మార్పు లీకాలమున నిట్లు గలిగిన వని తెలుపవలెను. ఆమార్పులయందుఁ గొన్ని మాండలీయ కము లుండవచ్చును. అట్టియెడ మాండలీయకము లివి యని వ్యాకరణము నిరూపింపవలెను. అట్లు నిరూపించుటయగాక, యామాండలీయకము లేయే మండలములకు సంబంధించినవో, యెప్పు డేర్పడినవో, యెట్లేర్పడినవో, యే కవులవలన నవి ప్రయోగింపఁబడినవో యాసమాచారమును గూడఁ దెలుప వలయును.

వ్యాకరణ మిట్లున్నచో భాష కంతకును బనికివచ్చును. భాష యనఁగా నొక్కపద్య కావ్యములలోని దే కాదు. గద్య కావ్యములలో నున్నదియు భాషయే. గద్యకావ్యములలోని భాషకుఁగూడ వ్యాకరణము గతిని గల్పింపవలయును. వ్యాకరణమునకు శబ్దము మూలము. అట్టి శబ్దసిద్ధి లోకము వలనఁ దెలియనగును. లోక మనఁగా శిష్టలోకము. శిష్టు లనఁగా భాషాతత్త్వము నెఱింగినవారు. అట్టివారు కవులు గావచ్చును, పండితులు గావచ్చును. ఈశిష్టులయందు వీరు ప్రామాణికులు—వీరప్రమాణికులు—అని మనము భేదమును జూపరాదు. ఎవరిపదములు వారివి. ఎవరి ప్రయోగములు వారివి. అందఱి ప్రయోగములను వ్యాకరణము గమనింప వలెను.

ఇట్టిది సరియైన వ్యాకరణరచనావిధానము. మన వైయాకరణులకుఁ బాణిని యాదర్శప్రాయుఁడేయైనను, నాతని రచనావిధానము మాత్రము వీరికిఁ బట్టువడినదిగాదు. పాణిని ప్రయోగముల నన్నింటిని గైకొనియే సూత్రములను రచించెనుగాని, యేవో తనకు సమంజసములని తోచిన కొన్ని ప్రయోగములకు మాత్రమే గతిని గల్పించలేదు. రెండియు నతఁడు నానాదేశములందు నిత్యవ్యవహారములోనున్న పదములను గ్రంథస్థము సేయుటగాక యాయాపదము లాయాదేశములకు సంబంధించినవనియుఁ దెల్పియున్నాఁడు. మాండలీయక భేదములను గూడ విశదపఱచినాఁడు. అతఁడు తెలియక విడిచిపెట్టిన ప్రయోగములకును, నతని తరువాత మార్పులను బొందిన ప్రయోగములకును, గాత్యాయనుఁడు, వరరుచి, యిష్టులను వార్త్తికములను గల్పించి సంస్కృత వ్యాకరణమును విపుల మొనర్చి యున్నారు.

ఇట్లు సంపూర్ణమగు వ్యాకరణమును జీవద్భాషలకు వ్రాయుట సాధ్యము గాక పోవచ్చును. జీవద్భాషాప్రవాహము నెవ్వరు నరికట్టఁ జాలరు. అది దాని యిష్టము వచ్చినట్లురుగుచుండును. వ్యాకరణ మెల్లప్పుడు దాని ననుసరించి యుండవలయును. వ్యవహారచ్యుతములగు భాషలకిట్లు సంపూర్ణమగు వ్యాకరణమునుగల్పించుటకు వీలున్నది. అందు

వైయాకరణులు గ్రహింపవలసిన ప్రయోగములు, పరిమితములు. అయ్యవి వ్యవహారచ్యుతములగుటవలన మఱి మార్పు నొందవు. తెనుఁగువంటి జీవద్భాషలయం దాయా భాషాచరిత్రములఁ దెలుపు వ్యాకరణములు ప్రస్తుతకాలమునకుఁ గల ప్రయోగముల ననుసరించి యేర్పడుటకు వీలున్నది. ముందు గలుగఁబోవు మార్పులను భావివైయాకరణులు గ్రంథస్థము సేయఁగలరు. సరియైన వ్యాకరణరచనావిధాన మన నిట్లుండవలయును.

౫

ప్రస్తుతము తెలుఁగు లక్షణ గ్రంథము లెన్నియేనియుఁ గలవు. దాదాపు ముప్పది గలవు. వీని యన్నింటియందు నాంధ్ర శబ్ద చింతామణియు, నథర్వణ కారికలును, స్వతంత్ర గ్రంథములై యున్నవి. తక్కిన వన్నియు నీ రెండుగ్రంథములకు సవరణములును వివరణములును నై యున్నవి. ఈ సవరణ వివరణ గ్రంథములందు బాలవ్యాకరణము సర్వజనాంగీకారమును బడసి, యగ్రస్థానమును వహించి యున్నది. దీనిని క్రీ. శ. ౧౯ వ శతాబ్దమువాఁడగు పరవస్తు చిన్నయ

సూరిగారు రచించి యున్నారు. ఇది స్వతంత్ర గ్రంథ మని స్ఫురింపఁ జేయుటకై చిన్నయసూరిగారు.

మును మనుపజ్ఞంబగు మం
దనరిన వ్యాకృతిని సూత్ర తతియదికొంతకుఁ
దెనిఁగించి యిది రచించితి

అని చెప్పికొనియున్నారు. అంత మాత్రముచేత స్వతంత్ర గ్రంథమగునా? ఇప్పటి పండితులందఱును దీనిని వేదతుల్యముగాఁ జూచుచున్నారు. మీఁదుమిక్కిలి తెనుఁగునకు సప్రమాణమగు లక్షణ గ్రంథమిదియేయని భావించి దీనివలన సాధింపఁబడని ప్రయోగములను దప్పులనుచు, వీలగు నెడలఁ బురాతన గ్రంథములలోని విశేషప్రయోగములను దీనికనుకూలముగ సవరించి యున్నారు. ఉదాహరణమునకు—

ఎడుతలద్రుతంబున కచ్చుపరంబగునపుడు మకారంబగు.

బాల. క్రియా. సూ ౨౮.

అను సూత్రములోని 'ఎడు' అనుదాని ననుసరించి మన పండితులు భారతములోని 'అయ్యెడమనియె' అను ప్రయోగములను 'అయ్యెడుమనియె' అని దిద్దియున్నారు. ఈ 'ఎడు' అనునది యచ్చు పొరపాటై యుండునేమో? ఇంకను—

"ప్రథమ మీఁదిపరుషములకు గ స డ ద వలు బహుళముగానగును.

బాల. సంధి. సూ ౧౩.

అని చెప్పఁబడియున్నది. కాని యీ గ స డ వా దేశము నిత్యమని క్రీ. శ. ౧౩ వ శతాబ్దమునాటి దగు ఓపిలి సిద్ధి చోడరాజు గోణిదెన శాసనము దెలుపుచున్నది. ఇందు సంస్కృత సంస్కృత పదములమీఁద ౭ సార్లును దెనుఁగు దెనుఁగులమీఁద ౧౦ సార్లును, సంస్కృత తెనుఁగులమీఁద ౨౯ సార్లును, తెనుఁగు సంస్కృతముల మీఁద ౧ సారియు, నవ్యయములమీఁద ౧ సారియు, గసడవాదేశము నిత్యముగా వచ్చియున్నది. ఇప్పుడు మనకుఁ బ్రమాణ మగునది బాల వ్యాకరణమా? లేక యీ శాసనమా? ఇంకను—

"క్త్వార్థంబైన యిత్తునకు సంధిలేదు."

బాల. సంధి సూ ౫.

అను సూత్రమున కందఱంగీకరించి యున్నారు. కాని దీనికి వ్యతిరేకముగా నెన్నియేనియుఁ బ్రయోగములు గాన వచ్చుచున్నవి.

అందిచ్చు } ఇవి శబ్దపల్లవములని కొందఱి మతము. సమస్త పదములని
మెచ్చిచ్చు } మఱి కొందఱి మతము.

ఇటుజూపటు లటుజూపిటు...
విజయ విలాసము.

ఇట్టివి మఱికొన్ని ప్రయోగములు దాసు శ్రీరామపండిత విరచితంబైన దేవిభాగవతము నందుఁ జూడనగును.

ఈ విధముగాఁ గొన్ని ప్రయోగములు గానవచ్చుచున్నవి. వీని నన్నింటిని బాలవ్యాకరణము ననుసరించి దిద్దివేయ వలసినదేనా? లేక తప్పులని త్రోసివేయ వలసినదేనా? ఇంకను, నాత్మనే పదమునందు, "కొను" ధాతు వుండవలయునని బాలవ్యాకరణము సెప్పి యున్నది. కాని "కొను" ధాతు రహితముగ వేనకువేలు ప్రయోగములు గానవచ్చుచున్నవి. వీని కన్నింటికి గతిఁజూపవలదా? వెండియు గసడదవాదేశము నందు విశేషప్రయోగ మొకటి కాళహస్తిమాహాత్మ్యము నందున్నది.

శా. ... ... ... కూఁడునీ
శ్లేసుట్టంబులు దెచ్చిపెట్టెదరు? ......
ఆ. 3. ప. ౬౫.

"సుట్టంబులు" అను దానియందున్న గసడదవాదేశము వ్యాకరణ యుక్తమో లేక తిన్నని ముద్దు పలుకో తెలియకున్నది. ఇంకను షష్ఠీ తత్పురుష సమాసమున

రెండును సంస్కృత పదములగుచో సంధి యగుననియు, నొకటి తెనుఁగు, నొకటి సంస్కృత మగుచో "న" గాగమం బగుననియు, బాలవ్యాకరణము సెప్పుచున్నది. ఇది యెంత వఱకు సరియైనదో విచారింతము—

విధాతృ+ఆనతి=విధాతృ నానతి.
మాతృ+ఆజ్ఞ=మాత్రాజ్ఞ.
రాజు+ఆజ్ఞ=రాజాజ్ఞ.

పై వాక్యమున "ఆనతి" అనునది తెనుఁగు పదమగుట వలన సమాసంబున "న" గాగమంబు వచ్చియున్నది. తక్కినవి రెండును సంస్కృత పదము లగుటవలన సంధి వచ్చినది. అగుచో—

రాజు+అల్లుఁడు.

అనుచోట సమాసం బగునేనిఁ బైసూత్రము ననుస రించి, 'రాజునల్లుఁడు' అని యుండవలెను. కాని కాళహస్తి మాహాత్మ్యము నందు—

ఉ. ... ... ... ... యద్రిరా
జల్లుని నారగింపుమన ... ... ...
ఆ. 3. ప. ౭౩.

అని సంధి కల్పింపఁబడి యున్నది. ఇప్పుడీ ప్రయోగ మును గూర్చి మనమేమి సెప్పవలయును? మఱియు ‹ఇందు' ‹అందు' అనునవి ద్రుతంబులని బాలవ్యాకరణము సెప్పి యున్నది. కాని యివి ద్రుతాంతములు గావనియు, నవ్య యము లనియు, క్రీ. శ. ౯ వ శతాబ్దమునాటి దగు యుద్ధ మల్లుని బెజవాడ శిలాశాసనము దెల్పుచున్నది.

„అనఘుణ్డునేకొని యిన్దు ప్రత్యక్ష...”

అని ద్రుతాంతంబు గాదని నిరూపించుచు గసడదవా దేశంబును నిత్యంబుగఁ బాటించి యున్నది. కాని శ్రీయుత జయంతి రామయ్యపంతులుగారు, బాలవ్యాకరణమునే పరమ ప్రమాణముగాఁ గైకొని దీనిని “యిన్దుఁ బ్రత్యక్ష” మని ద్రుతాంతముగా దిద్దియున్నారు. శాసనముకంటె బాల వ్యాకరణమే యెక్కుడు ప్రమాణ మని కాఁబోలు వీరి మతము? ఇట్లున్నది మనవారి లక్షణము. ఇంకను “కావున” అను పదము, దీనికి రూపాంతరమగు “కాన” అను పదము ద్రుతాంతము లని చినయ్యసూరి మతము. కళలని కొందఱి మతము. శ్రీమహాభారతము నందు—

మ. ధృతరాష్ట్రుండును...చేటొందుఁ గా
న తగం బొందుట..................

ఉద్యో. ఆ ౧. ప. ౩౮౯.

అనియు, శివతత్త్వసారము నందు—

"శ్రుతులు మోయుఁగాన కపర్ది !"

అనియుఁ గళగాఁ బ్రయోగింపఁబడి యున్నవి. కొన్ని యెడల ద్రుతాంతములుగను బ్రయోగంబులు గానవచ్చుచున్నవి. ఈ ద్రుతంబు వైకల్పిక మేమో? బాలవ్యాకరణ మిట్టి ప్రయోగంబులకు గతిని గల్పించుటలేదు. ఇంకను బ్రథమంబులగు నామవాచకంబుల మీఁదఁ గొన్నియెడలఁ బ్రథమా విభక్తి ప్రత్యయంబగు "డు" లోపించుచున్నది.

"జనులెల్లఁజూడ మలహరుని
నిను సంస్తుతిచేసి. ... ...
శివతత్త్వసారము. ప. ౪౧౫.

అనియుఁ గొణిదెన శాసనమందు...

"అట్టి కరికాల నృపతికిఁ
బుట్టెను మహిమానచోడు। భువి నతనికి

వెండియు—

"భూపదిలీపుఁడై పరగు। పొత్తపిసిద్ధనితమ్ము మల్లధా
త్రీపతికిన్ ... ... ...

అనియు "డు" ప్రత్యయము లోపించిన ప్రయోగం బులు గానవచ్చు చున్నవి. ఇట్టి ప్రయోగములకు బాలవ్యాక రణము గతిని గల్పింపఁ జాలకున్నది.

ఇట్లసంపూర్తిగ వ్యాకరణము లుండుటఁబట్టి ప్రయో గంబుల సాధుత్వాసాధుత్వములను గూర్చి భిన్నమతములు బయలు దేరుచున్నవి. సంపూర్ణమగు వ్యాకరణము లేకపోవుట వలన మనభాష కెంతయు లోపముగానున్నది. ఈలోపంబు వలన భాషాశాస్త్ర నిర్మాణమునకుఁ దగిన యవకాశము లభించుటలేదు. సంస్కృతమర్యాద ననుసరించుటవలన మన వ్యాకరణము లన్నియుఁ దప్పుతోవబట్టి యున్నవి. నిజముగ విచారించిన మన యాంధ్రమునఁ గారక మనునది యున్నట్లు గాన్పించుటలేదు. ముందు తెనుఁగునందు నిర్ధారితములగు విభక్తులుగాని, విభక్తిప్రత్యయములు గాని లేవనియే నా యభిప్రాయము. చిన్నయసూరిగూడ—

ఒకానొకచో నొకవిభక్తికి మఱియొక విభక్తియునగు.

బాల. కారక సూ. ౨౧

అని కారకమును గూర్చి చెప్పియున్నాఁడు. ఒక విభ క్తికి మఱియొక విభక్తియగునప్పుడు దానికిఁ గట్టుబాటనునది యెక్కడఁ గలదు? అదిగాక యొక విభక్తికి మఱియొక విభక్తి

యగునదియెక్కడ? అదియైనను నిర్ణయింపఁబడలేదు. ఒక్కొక చోట ద్వితీయకుఁ దృతీయయు, సప్తమియుఁ, గొన్నియెడలఁ బ్రథమమును జెప్పుకొనవచ్చును. పంచమికి షష్ఠిఁ జెప్పుకొన వచ్చును. ఇటు చూడుడు—

వ్యక్తముగ లింగతనుఁడను
యుక్తి యెఱుంగుటకుఁ జాలఁ నుత్కృష్టమగున్......

శివతత్త్వసారము. ప. ౧౪౯

అని యున్నది. ఇక్కడ 'ఎఱుంగుటకంటెఁ జాల నుత్కృష్టమగున్' అను పంచమీకారకమునకు బదులు 'ఎఱుంగుటకుఁ జాల నుత్కృష్టమగున్' అని షష్ఠీకారకము వాడఁబడియున్నది. ఇట్టియెడల నిదమిత్థమని మనము నిర్ణయించు టెట్లు? అదియుఁగాక నామవాచకముల యేక బహు వచనముల రెండింటియందు నొకే విధమగు విభక్తి ప్రత్యయములు చేరుచున్నవి.

ఉదా॥ రామునియొక్క; రాములయొక్క

కాని సంస్కృతమునం దిట్లుగాక వేఱుగా నున్నవి. చూడుడు.

ఉదా॥ రామస్య; రామాణాం.

ఇంకను సంస్కృతమునందు విభక్తు లన్నియు నిర్ధారిత ములు. ఒకదాని కొకటి సాధారణముగఁ గావు. ఇట్టి నిర్ధారితములగు విభక్తులును, విభక్తి ప్రత్యయములును, లేకపోవుట వలననే, తెనుఁగునఁ గారక మనునది లేదని చెప్పవలసి వచ్చుచున్నది. మన వైయాకరణులు సంస్కృతము ననుసరించిన వారగుటవలన నందున్న విభక్తుల నన్నింటిఁ దెనుఁగులోనికిఁ జేర్చియున్నారు. కాని వానికిఁ బ్రత్యేకత్వమును నిర్ణయింప నేరక, యర్థమును బట్టియు, సందర్భమును బట్టియు నెఱుంగు నదియని దాటిపోయినారు. ఇట్టిది యెన్నఁడును లక్షణము గానేరదు. మనవారి లాక్షణికత్వ మిట్లున్నది. ఇది యిట్లుంచుడు. మన లాక్షణికులు 'అతిశయాన ఆవిధాన' అనుపదములందు 'ము' లోపించి (అతిశయమున, ఆవిధమున) దానికిఁ బూర్వమందున్న వర్ణమునకు దీర్ఘంబు వచ్చుట యాధునికంబని తలంచుచున్నారు. కాని యిది మిక్కిలి ప్రాచీనము. కొణిదెన శాసనమునందు (క్రీ. శ. ౧౨వ శతాబ్దము) 'అంగభోగరంగభోగాలకు,' అను ప్రయోగము గానవచ్చుచున్నది. కనుక యిది నవీనము గాదు. ఇట్టి యాధునిక ప్రయోగములు సాల వఱకుఁ బ్రాచీనుల యందుఁ గాన్పించుచున్నవి.

ఈ విధముగా భాషాతత్త్వమును సమగ్రముగా గుర్తించి లక్షణము నేర్పఱచుటకుఁ గడంగ వలయును.

లక్షణమును గల్పించు నప్పుడు లాక్షణికుఁడన్ని ప్రయోగ ములఁ గై కొనవలసిన వాఁడయ్యుఁ గొన్నియెడలఁ బ్రయోగ ముల సాధుత్వా సాధుత్వములను గూర్చియు విచారింపవలసి యున్నది. కాని విచారణము నందు సంకుచితభావ మెంత మాత్రమును బనికిరాదు. వెండియు నిది ప్రయోగింపఁ దగినది—ఇది ప్రయోగింపఁ దగనిది—అని ఖండితముగను జెప్పరాదు. విశేషము లున్న విశేషములనియే చెప్ప వలయును. ఈ యంశమును గూర్చి ౧౯౧౬ సం॥ నందు కొవ్వూరులో జరిగిన సారస్వత మహాసభయం దిట్లు సెప్పఁబడి యున్నది.

„తెనుఁగు పదముల సాధుత్వాసాధుత్వములు స్పష్టముగా బోధించు తెనుఁగు వ్యాకరణము లేనందు వలనను—ఉన్నవి పరస్పర విరుద్ధములుగను, నసంపూర్ణములుగను, నున్నందుచేతను, వ్యాకరణము నకు మూలములు ప్రయోగములే యగుటచేతను, తెనుఁగు గ్రంథములలో నున్న ప్రయోగముల నన్నింటిని గ్రాహ్యములని యంగీకరింపక తప్పదు. నేఁడు వాడుకలోనున్న పదములు నూరు సంవత్సరముల నుండి పెద్దల వాడుక చొప్పున నున్నట్లు నిదర్శనము లున్నప్పుడు, వానిని నిర్దుష్టములని యెన్నక తప్పదు. నేఁడు తెనుఁగు దేశమునం దంతటను బెద్దల వాడు కలో నేక రూపముననున్న పదములు, పూర్వగ్రంథములలోఁ గాన్పింపక పోయినను, నేటి గ్రంథములలో నున్న యెడల సాధువులేయని యొప్పు కొనవలయును.”

జీవద్భాషాతత్త్వమును గుర్తించిన వారి తీర్పున కంగీకరింతురని నేను నమ్ముచున్నాను. మొదట వ్యాకరణము భాషను సాధించి, భాషా శాస్త్రమును నిర్మించుటకుఁ గాను బుట్టియున్నది. అట్టియెడ నది విశాలముగా నుండవలయును గాని సంకుచితముగా నుండఁగూడదు. కవులు దమ యిష్టము వచ్చినట్లు బదములను గొన్ని యెడల మార్చుకొనుచుందురు. వ్యాకరణ మట్టి ప్రయోగములకు గతిని గల్పింపవలయును గాని తప్పని త్రోసివేయరాదు. జీవద్భాషలకు మార్పను నది ముఖ్యలక్షణము గనుక, యందలి పదములు మారుచునే యుండును. ఆమార్పులను వ్యాకరణము గమనింపవలయును. ఇట్లు వ్యాకరణము రచింపఁబడిన యెడల నది సంపూర్ణ మగుటయే గాక, భాషకంతకు ననువర్తించునది యగుటయే గాక, భాషాచరిత్ర నిర్మాణమునకుఁ బట్టుగొమ్మయై యొప్పఁ గలదు.

# కర్ణార్జునుల యాధిక్య నిర్ణయము.

# కర్ణార్జునుల యాధిక్య నిర్ణయము.

౧౫-౩-౧౯౨౫.

శ్రీమదాంధ్ర మహాభారతమునఁ జేరెన్నికఁగన్న భీష్మద్రోణ కృపాశ్వత్థామలు మొదలుగాఁగల వీరులనేకు లుండ నొక్క కర్ణార్జునుల యాధిక్యమే యేల విచారింపఁబడ వలయును? అనుదానికిఁ దగిన కారణము లేక పోలేదు. ఇటు కౌరవబలంబున నర్జునునితో నని సేయ నోపువాఁడగు గర్ణుఁ డుంటయే సుయోధనుండు గయ్యమునకు సంసిద్ధుఁ డగుటకు మూలకారణము. అంత మాత్రమే కాదు. కర్ణునినే తెప్పగాఁ గొని సుయోధనుఁడు, శత్రు సముద్రమును నీదఁ దలంచి నాఁడు. భీష్మద్రోణులు మున్నగు వీరాధివీరులు లేకపోలేదు. ఉన్నారు. వారెల్లరును బాండవపక్ష పాతులనియే దుర్యోధనుని దృఢ నమ్మకము. అయ్యది నీతికాని, బూతుకాని యతని ననుసరించువాఁడు గర్ణుఁ డొక్కఁడే కావునఁ గురుక్షేత్ర సంగ్రామమునకుఁ గౌరవుల వంకఁ గర్ణుఁడే మూల పురుషుఁడు.

---

ఇది కీ. శే. ముత్తరాజు శివకామయ్య పంతులు బి. ఏ. యల్. టి., గారి జ్ఞాపకార్థమై యేర్పఱుపఁబడిన వ్యాసరచనాపోటీపరీక్ష యందుఁ బ్రథమ బహుమానమును బడసినది. కొంతవఱకు విపులీకరింపఁబడినది.

ఇఁకఁ బాండవుల వైపువార లెవ్వరో తెలిసికొనవలె. అందు ముఖ్యముగాఁ గర్ణునితోఁ బోరఁదగిన వాఁడొకఁడుండి తీరవలె. లేకున్నచో యుద్ధము పొసఁగనేరదు. అగుచోఁ గర్ణునితోఁ బోరఁజాలిన వారెవ్వరు?

ఆ. పరశురాముఁ డొండె ! హరుఁడొండె నరుఁడొండెఁ
గాక యొరులుఁగలరె ? కర్ణునోర్వ.

భా. ఆది. సప్త. ప ౨౦౨

అనుదానిఁ బట్టి కర్ణునోంచు వారలు ముగ్వురని తేలినది. అగుచోఁ బాండవ బలంబునఁ బరశురాముఁడు లేఁడు. హరుఁడో? హరియందు లీనమైయున్నాఁడు. అయినను హరిహర స్వరూపుఁడగు శ్రీకృష్ణ పరమాత్ముఁడు యుద్ధము సేయనని మున్నే ప్రతిజ్ఞ వట్టియుండెను. ఇఁక మిగిలినది నరుఁడు. ఇతఁడే పాండవ మధ్యముఁడగు నర్జునుఁడు. అగుచోఁ బాండవుల వైపున సమరంబున కితఁడేనా కారకుఁడు? విచారింతము.

క. విను మప్పలుకులు పాటిగఁ
గొని సుయోధనుని తోడఁ ! గొంటినిఁ బగ.

భా. కర్ణ. తృ. ప ౬౦

అని ధర్మరాజు వలికినాఁడు. ఆపలుకు లెట్టివి?

,,అని వధించెదఁ గర్ణునేను''

అని యర్జునుఁడు ప్రతిజ్ఞఁ గైకొని చెప్పిన పలుకులు. పై దానివలన ధర్మరాజు యుద్ధమున కర్ణునిఁ జూచుకొనియే సమకట్టెనని తేలుచున్నది. కనుక పాండవుల వైపున నర్జునుండే మూల పురుషుఁడు. ఇప్పటికి సందియము తీరినది. ఆ మహా కురుక్షేత్ర సంగ్రామమునకుఁ గర్ణార్జునులే ప్రధాన పోషకులగుట వారల యాధిక్య మెట్టిదో కొంతవఱకు విచారించి చూతమనియే నా యభిప్రాయము. ఎంతవఱకుఁ గృతకృత్యుఁడ నౌదునో చెప్పఁ జాలను.

## వీ రుఁ డె వఁ డు ?

ప్రస్తుతాంశమును విచారించుటకుఁ బూర్వము వీరుఁడన నెవ్వఁడో, వీరశబ్ద మెన్ని తెఱంగులఁ బరగుచున్నదో, తద్గుణంబు లెట్టివో కొంతవఱకెఱుంగుట ప్రస్తుత కార్యానుకూలంబని తలంచెద. ఈ వీరశబ్ద మొక్క యుద్ధవీరునకే గాక ధీరసత్యవ్రతునకు, నిరుపమదానపరతంత్రునకు, నిర్మల ధర్మశోభితునకు, నసమాన శాంత గుణోపేతునకు, నింకను దక్కఁగల గుణంబుల వారల కందఱకుఁ జెల్లుచున్నది. ఇఁక వీరి గుణంబు లెట్టివి? మిన్నువిరిగి మీఁదఁ బడినను శత్రు మధ్యంబున నొంటిమెయిఁ జిక్కినను దుదకుఁ బ్రాణాపాయము సంభవించు నప్పుడైనను, జలింపక విరోధి వర్గమునకు వెన్నిచ్చి పాఱిపోవక, యూపిరియుండు నంతవఱకు రణరంగ

మున నిలుచువాఁడే యుద్ధవీరుఁడు. సామ్రాజ్యము పోయినను దారా పుత్రాదులు నశించినను, మానాభిమానములు మంటఁ గలిసినను సూనృతమును బాలించువాఁడే, సత్యవీరుఁడు. (హరిశ్చంద్రుఁడు) తన్నెవ్వరేది యడిగిన దాని నొసంగుటయే గాక యొక వేళ నెవ్వఁడేని మేని కండల నాశించినను గోసి యిచ్చువాఁడే దానవీరుఁడు. (శిబిచక్రవర్తి) ఎట్టి కాలము సంప్రాప్తమైనను దుదకుఁ గన్న కుమారుని ప్రాణములు వోవనున్నను, ధర్మమును దప్పక నిలుచువాఁడే ధర్మవీరుఁడు. (ప్రహ్లాదుఁడు) ఇఁక శాంతవీరునిఁ గూర్చి చెప్పవలసిన దేమున్నది? ఇవి యన్నియు నిచ్చోట ననవసరములని తలంప వలదు. ఈ యంశమున నివి యన్నియు విచారింపఁ బడఁగలవు. ఇఁకఁ గర్తవ్యాంశ విచారణమునకుఁ గడంగుదము.

## ఒక చాటువు.

క. నరవర ! నీచే నాచే
వరమడిగిన కుంతిచేత ! వాసవుచేతన్
ధరచేత శల్యుచేతను
నరయంగాఁ గర్ణుఁడీల్గె ! నార్వురిచేతన్.

అని యొక వదంతి కలదు. ఇందు నరవర యను శబ్దము, ఎవరి కెవరిచేత సంబోధింపఁ బడినదో తెలియదు. "నీ,నా" యను పరార్థ స్వార్థములకుఁ గర్తలెవ్వరో యొటుకే

లేదు. ఈ చాటువు నిజమా? అబద్ధమా? భారత ప్రమాణము ననుసరించినచో నీ విధమునఁ గాక, యింకొకరీతిని గర్ణుని చావున కార్వురు కారకులనియే తేలుచున్నది. వారలు విప్ర పరశురామ వాసవ కుంతి శల్యార్జునులు. భారతమునందు ధారుణీదేవి శాపము గాన్పించుటలేదు. ప్రస్తుతము విప్ర పరశురామ శాపములఁ గూర్చి యొకింత తెలిసికొన వలయును.

## వి ప్ర శా ప ము.

కన్నియయగు కుంతి గర్భంబున భాస్కరుని వరంబునఁ బుట్టినవాఁడు గర్ణుఁడు. పుట్టినంతనే తల్లిచేత నదీగర్భంబున విడువఁబడి హస్తిపురంబున నొక్కసూతుని చేఁ జిక్కి వానియింట నీతఁడు పెంపఁబడియె. అది మొదలుగఁ బరాక్రమవిక్రమశాలియగు కర్ణుని సూతపుత్రుండనియే యందఱు భావించుచుండిరి. ఏఁడెనిమిదేండ్ల యీడుగలవాఁడయ్యెను. ధనుర్విద్యాభ్యాసమునకుఁ దగియుండె. కాని నేర్పు వారెవ్వరు? సూతపుత్రుఁడుగదా? నిమ్నజాతి కష్టాడు గూడ దురవస్థలున్నవి కాఁబోలు! పాపము! పైకి సూతపుత్రుఁడని పిలువంబడినను బుట్టినది సుక్షత్రియ వంశమగు సూర్యకులంబునఁ గదా? అందు సహజముగాఁ గవచకుండల

కారి. అట్టి వాఁడూరక కూర్చునఁ గలఁడా? తనకుఁ దానే పురబాహ్య ప్రదేశంబున శరవిద్యాభ్యాసముఁ జేసికొన మొదలు పెట్టె. ఇట్లుండ నాతఁడొకనాఁడు గురి నేర్చు కొను సమయంబున నెచ్చట నుండియో యొకమాయ యాఁబెయ్య యటు పోవుచు విడువఁబడిన యంపతాకున ధరణిఁగూలె. అంతఁ దదధిపుఁడగు బ్రాహ్మణుఁ డధిక కోపంబున నచ్చటికిఁ జేరఁజని బాలార్క ప్రతి మానుఁడగు కర్ణునాలోకించి-

గీ. సమరమేకాగ్ర నిర్భరో । త్సాహవృత్తి
నడచు నరదంబు చక్రంబు । పుడమి గ్రుంగి
చలయు నెవ్వీరు మార్కొని । గెలువఁ గోరి
శ్రమము సేసెద వతనిచేఁ । జావు మీవు.

భా. కర్ణ. ద్వి. ప ౧౦.

అని యతిదారుణంబుగ శాపంబిడియె. అడుగులోనే హంసపాదు! అప్పుడే కర్ణుని యాయువు, శాపములకు గురియైనది. ఆతఁడు కేవలము పసిబాలుఁడు. యుక్తాయుక్తంబు లెఱుఁగనివాఁడు. తన కార్యము నందేక దీక్ష మెయి మెలంగుటఁ జేసి యాయకృత్యంబు పరాకున సంభవించినది. కాని యెఱిఁగి యెఱింగి యాతండద్దానిఁ జంపలేదే? ఆతని కేమి తెలియును? పాపము! ఆశాపశోక వహ్నికాతని మృదుల హృదయ పద్మం బెంతగా మాడిపోయినదో కదా? అయిన

నాతఁడు రాచబిడ్డ. కావున దిగులొందలేదు. తానొనర్చినది యపరాధమే యని యొప్పుకొనినాఁడు. అట్టి యావులను వేలకు వేలొసంగెదనని పలికినాఁడు. వలయుచో ననేక ధనావళు లిచ్చెద నన్నాఁడు. కడు దీనముగా నాతని పాదములపై వ్రాలి శాపమును మరల్పవేయని యెంతయో ప్రార్థించినాఁడు. బ్రతిమాలినాఁడు. కపటవేషధారియగు నావిప్ర మహాశయునకుఁ గరుణ పుట్టలేదు. కపటవేషధారియే కాకున్న సహజముగ క్షణకోప మాత్రులును, గుణామయులును, నగు బ్రాహ్మణుల కంతటి కఠిన హృదయమా? ఆతని మొర నాలకింపలేదు. పాపము! పసివాఁడును గేవల మమాయకుఁడును నగు కర్ణుఁడు తనకుఁ బసిబిడ్డఁడని- ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డఁడని- తల్లిదండ్రులు దన మేన నలంకరించిన సొమ్ములను జూపించుచు——

క. నాకుఁగల సొమ్ములెల్లను
నీకిచ్చెద ననుఁ బ్రసాదనిరతకటాక్షా
లోకితునిం జేయుము...

భా. కర్ణ. ద్వి. ప ౮౩

అని కడుదీనముగా వేడినాఁడు. పసిబిడ్డల మృదుమధురాలాపంబుల విననేరని యా మొరటు విప్రుని చిత్తమును నాతని దీనాలాపములు గరగింపఁ గలవా? ఇది దైవమాయయో, మనుష్య మాయయో, యెవరు చెప్పఁగలరు?

## భార్గవ శాపము.

కర్ణుఁ డివ్విధంబున విప్రశాపంబు నొంది, తనకుఁ దానెంత నేర్చినను గురుముఖంబునఁ బడయని విద్యలు కొఱగావని మనంబునఁ దలంచి, విశిఖవేదము, వేదము నొక్క రూపముగాఁ గొని, భువి జన్మించిన జామదగ్న్యమునికుంజరుని కడ శస్త్రశిక్షార్థియై యేగ నతండు కులం బడుగుటయు,సూత కులంబని తెల్పిన బ్రహ్మాస్త్రము మున్నగు ప్రముఖాస్త్రంబులఁ దనకుఁ దెల్పఁడేమో యనియు నంతియకాక తుదకు దగ్గఱకే చేరనీయఁడేమో యనియు, నెడఁదలంచి లోకజ్ఞానము నంతగా నెఱుంగని పసిబాలకుఁడు గావున- అందుఁ గేవల మస్త్రశిక్షార్థియై యున్నవాఁడు గావున- బొంకునకునోర్చి, బ్రాహ్మణ కులంబని తెల్పి, గురుభక్తి తాత్పర్యంబు పెంపున నస్త్రవిద్య యంతయుఁ గ్రమంబున నభ్యసించెను. అట్టియెడ నొక్కనాఁడు గురుం డాతని యంకతలంబున శిరంబునిచి నిద్రవోవుచుండ నొక్క కీటకంబాతని క్రిందితొడఁ దొలువ మొదలు పెట్టె. అప్పుడాతఁడు, తాను లేచినచో గురువునకు నిద్రా భంగమగుననియుఁ దానఁ దన గురుభక్తికి లోపము గలుగు ననియు నెంచి తద్బాధ కోర్చుచు నట్టులనేయుండ రక్తంబు ప్రవహింపఁ దొడంగె. కొంతవడికి భార్గవుండు మేల్కాంచి నెత్తుటి వెల్లువంగని, తదీయకారణం బాతనిచే

నెఱింగి, యాతని ధైర్యంబున కచ్చెరువంది "నీవు బ్రాహ్మణుండవుగావు. ఎవ్వండవో తెల్పుము ?" అని కోపంబుతో నడిగినఁ గర్ణుండు భయంపడి నిలిచియుండ, నప్పు డక్కీటకం బదృష్టపూర్వ వికృతాకారంబై యుండె. అదిగని యాతండు, తన వినాశమున కెవ్వరో కామరూపులు కృతనిశ్చయులై యున్నవారలని యెఱింగి నిక్కంబు దాపక తెల్పిన నతండు కినిసి కపటవేషంబున బ్రహ్మాస్త్రంబు గ్రహించితివి. కావున నది నీకు మృత్యువాసన్నంబై నప్పుడు తోచుటయు, నాపద ముట్టినప్పుడు భార్గవాస్త్రంబు దోపకుండుటయుఁ గలిగెడుమని శపించెను.

అయినది. అప్పుడే రెండు ఘోర శాపములు. బాలకుండని కరుణించిన దెవ్వరు? అది యేలకోగాని పుట్టినప్పటి నుండియు నాతనియెడఁ బ్రకృతియంతయు విరోధ భావమునే వహించియున్నది. అకారణముగ విప్రశాపము. అనావశ్యకముగ భార్గవ శాపము. పరశురాముఁడు మునిసింహుఁడు గదా? దివ్యదృష్టితోఁ గర్ణుని కులగోత్రాదుల నెఱుంగఁ గూడదు కాబోలు. ముదుసలియగుట బుద్ధి పెడతలఁ బట్టి నట్లున్నది. ఇఁక జంభారియున్నాడు. అర్జునుఁ డింకను బుట్టనే లేదు. ముందు తన కర్జునుఁడు పుట్టునను సంగతి తెలిసికొనియే కాబోలు, పాపము! పెండలకడనే వేయికండ్లు సంపాదించు

కాని తన పుత్రునకెట్టి కీడు రాకుండఁ జూచుటకై త్రిలోకాధిపత్యమును వహించినాఁడు. వాసవుఁ డెంతటి స్వార్థపరుఁడు?

## అర్జునుఁడు.

పాండు భూపాలుని పత్నియగు గొంతికి వాసవ వర ప్రసాదంబునఁ బుట్టిన వాఁడర్జునుఁడు. ఈతండు చిన్నతనమందే పితృవిహీనుఁ డగుటఁ జేసి తాతయగు భీష్మునివలనఁ దన సోదరులతోఁ బాటు పెంపఁబడియె. కౌరవులకుఁ బాండవులకు విలువిద్య నేర్పుటకై ధనురాచార్యుఁడగు ద్రోణాచార్యుఁడు గాంగేయునిచే నియమింపఁబడి విద్యాభ్యాసంబునకుఁ బ్రప్రథమంబున శిష్యుల నెల్లర రావించి వారలతో,

గీ. అస్త్రవిలువిద్య గఱచి నాకైన యిష్ట
మొగిన తీర్పంగ నిం దెవ్వఁ డోపు ననినఁ
బాయ మొగమిడి కౌరవుల్ పలుకకుండి
రేను దీర్చెదనని పూనె నింద్ర సుతుఁడు,

భా. ఆది. పంచ. ప ౨౨౮

అప్పుడు కౌరవులలోఁ గర్ణుఁడు లేఁడు. అస్త్రవిద్యను బడయవలె ననెడియాస, యాతనికిఁ గలదు. కాని యాతఁ డేమి సేయఁగలఁడు? ప్రతివానికిని సూతపుత్రుఁడని యొకవంక దొరికినదికదా?

అర్జునుఁడట్లువలుక ద్రోణుండలరి యాతనిఁ జేరందీసి,

అన్న! ధనుర్ధరు లన్యులు నీకంటె
నధికులు గాకుండు నట్లుగాఁగఁ
గఱపుము విలువిద్య—

భా. ఆది. పంచ,

అని ప్రతినఁ జేసె. కుమారులంద ఱవ్విధంబున విలువిద్య నభ్యసించుచు నొక్కనాఁడు మృగయావ్యాపారంబున కరుగ నందొక్కభటుని కుక్కత్రోవఁ దప్పి మున్ను ద్రోణునిచేఁ దిరస్కరింపఁ బడియు నాతని యందలి గురుభక్తిచే నతని రూపంబచ్చున గుద్దినట్లుగ నొకమట్టిబొమ్మను జేసికొని దానిపై గురుభావ ముంచి యస్త్రవిద్యాభ్యాసము సేసికొనుచున్న యేకలవ్యుండను వాని చెంత కరిగి మొఱుఁగ వాఁడును నిజశర లాఘవంబు మెఱయ దాని ముఖంబునం దేడు బాణంబు లొక్కటఁ దొడిగిన నదిశరపూరితముఖంబయి కురుకుమారుల యొద్దకుఁ బాఱెను. వారును దచ్ఛరలాఘవంబునకు విస్మయ మందుచు జాడఁదీసి యతని కడకరిగి గురు వెవ్వరనియడుగ వాఁడును ద్రోణుండని తెల్పె. అంత నందఱును దిరిగి సదనం బులకరిగిరి. అప్పుడర్జునుఁ డొంటరిపాటున నాచార్యుని జేరం జని లోన మత్సరగ్రస్తుండయ్యుఁ బై కెంతయో దీనభావంబు దోఁచు నట్లాతనితో—

క. విలువిద్య నొరులు నీ క
గ్గలముగ లేకుండ నిన్నుఁ గఱపుదునని ముం
బలికితిరి నాకుఁ గాదే
త్రిలోకముల కధిపుఁ జూచితిమి యొక యెడన్.

క. నాకంటెను మీకంటెను
లోకములో నధికుఁడతి బలుండు ధనుర్వి
ద్యా కౌశలమున నాతఁడు
మీకుం బ్రియ శిష్యుఁడటె? యమిథ్యావచనా!

భా. ఆది. ౭ం ౨౩౯-౪౧

అని 'యమిథ్యావచనా!' అను సంబోధనము వలన ద్రోణునకుఁ బురి వెట్టినాఁడు. ఆ మాటలు విని యాతండదరి పడినాఁడు. కాని తన ప్రతిజ్ఞ నిలుపుకొనవలదా? అందు కెంతటి నీచకృత్యమును జేయుటకును ద్రోణుండు సంసిద్ధుఁడు. చేయించుట కర్జునుఁ డంతకంటెను సంసిద్ధుడు. ఇఁక వారి చేతల కడ్డ మేమున్నది? అప్పుడు గురుం డర్జునునితోఁ గలిసి యేకలవ్యుని యొద్ద కరిగి గురు వెవ్వరని యడుగ వాఁడును వినయమున నాచార్యునకు మ్రొక్కి ద్రోణుండని తెల్పె. అప్పుడాతండు సంతోషించి గురుదక్షిణ యిమ్మని కోర నతండును భక్తి పారవశ్యంబున—

క. ఇదె దేహంబిదె యర్థం
బిదె నా పరిజన సమూహ మిన్నిటిలో నె

## కర్ణార్జునుల యాధిక్య నిర్ణయము.

య్యది మీకిష్టము ? దానిన
ముద మొదవంగ నిత్తుఁగొనుఁడమోఘుం బనినన్.

భా. ఆది. పంచ. ప ౨౮౩

ఆచార్యుఁడు కోరినదియేమిటి? నిక్కముగా నతండు దనకున్న తెలివినంతయు నొక్కచోటికిఁ దెచ్చికొని బహు చక్కగా నాలోచించినాఁడు. కోరవలసిన దేదియో తెలిసికొనినాఁడు. ఇంకఁ గోరుటయే. కోరినాఁడు. ఏమని?

క. నెమ్మిని నీ దక్షిణ హ
స్తమ్మున పెనువ్రేలు దునిమి దక్షిణ యిమ్మి
ష్టమ్మిది నాకనవుడు విన
యమ్మున వాఁడిచ్చెదాని నాచార్యునకున్.

భా. ఆది. పంచ. ప ౨౮౪

గురుని ప్రతిజ్ఞ తీరినది. అర్జునుని మొగము చాటంత అయినది. ఏమి ద్రోణుని శిష్య వాత్సల్యము? ఒకరిని సమూలముగ వినాశ మొనర్చియేనియుఁ దనశిష్యునకు వన్నెఁ దెచ్చునంతటి ప్రజ్ఞాశాలి. ఇఁక నర్జునుఁడో గురుఁడెంతటి పనియైనను దనమీఁది వాత్సల్యమునఁ దనకు నెఱవేర్చి పెట్టుచుండెఁగదా యని చంకలు గొట్టుకొనుచుఁ జూచుచుండు నంతటి బుద్ధిమంతుఁడు. ఈ ద్రోణుఁడు ధనురాచార్యుఁడే యగుఁగాక. ఇసుమంతయేనియు ధర్మమెఱింగినవాఁడుగాఁడు.

లేనిచోఁ దనను గురువుగా నెంచుకొని విలువిద్యఁ దనకుఁ జానయై నేర్చుకొని గురుభక్తి పారవశ్యంబున సర్వంబును మీయదియే యని తెల్పునాతండు నిక్కంబగు గురుండైనచో విలువిద్యకుఁ బ్రధాన సాధనంబగు నంగుష్ఠము నీయుమని కోరునా? తనమీఁది వాత్సల్యముచేతఁ దన్ను గొప్పవానిఁగాఁ జేయుటకే గదా గురుం డట్టులఁ గోరుచున్నదని స్వార్థపరుఁడును, మత్సరగ్రస్తుండును గాకున్నచో నర్జునుండు నూచి యూరుకొనునా? ద్రోణుఁడు ధనుర్విద్యను బాగుగ నెఱింగిన వాఁడు గదా? ఒకరికి హాని యొనర్చి తన్మూలంబునఁ దన శిష్యుని గొప్పగాఁ జేయనెంచుటకంటె నాతని కొంటరిపాటున నెక్కుడు విలువిద్య నూరిపోయరాదా? అందువలననే యతనిని గొప్ప ప్రవీణునిఁగాఁ జేయరాదా? తుదకేమైనది? ఊరి పెండ్లి నుబ్బిచావునకుఁ గారణమైనది.

## అ స్త్ర వి ద్యా ప్ర ద ర్శ న ము.

ఆచార్యుండు దనశిష్యుల యస్త్రవిద్యా ప్రదర్శనంబు సేయఁ దలంచి యొక నియమిత దినంబు నేర్పఱచె. ఆనాఁడు శిష్యులందఱు వచ్చిరి. రంగస్థల బహిఃప్రదేశంబంతయుఁ బ్రేక్షకులచే నాక్రమింపఁబడియె. ముందు భీమ దుర్యోధనుల గదా యుద్ధము ప్రదర్శింపఁబడినది. తరువాత నర్జునుఁడు గురు నను

మతంబున రంగస్థలంబున నిలిచి తనకొంటరి పాటున నేర్చిన యస్త్రబలంబును సందఱితోఁ బాటు నేర్చిన శస్త్రబలంబును వివిధగతులఁ బ్రదర్శించి ప్రేక్షకుల కాశ్చర్య విస్మయంబులఁ గొలుపు చుండె. ఆ సమయంబునఁ దత్ప్రదర్శన కౌతూహలంబున నచ్చటికివచ్చి తాను సూతపుత్రుండు గాన రంగస్థలంబునఁ గాలుపెట్టిన నేమి పుట్టిమునుఁగునో యని భయంపడి రంగద్వారముననే నిలిచియుండి చూచుచుండ నర్జునుని యస్త్రప్రదర్శనంబును గాంచినంతనే యంతవఱకుఁ దనలో నడఁగియున్న సహజక్షత్రియ పౌరుషంబు దన్నుకొని మారుగాఁ బురికొల్ప నిలువనేరక నిజ విద్యాకౌశలంబుఁ బ్రదర్శింప నడుకట్టి భుజాస్ఫాలనంబు సేసిన నెల్లరు నాధ్వని కదరిపడి చూచుచుండ శశ్వత్కుండలోద్భాసితుండగు కర్ణుండు రంగస్థలంబుసొచ్చి ద్రోణు ననుజ్ఞాతుండయి మున్నర్జునుండు సూపిన యస్త్రవిద్యలెల్ల నశ్రమంబునఁ జూపి యందఱ కాశ్చర్యంబుఁ గలిగించె.

అప్పు డింద్రనందనుఁడు 'వీఁడెవఁడురా? మనకు దాపరించినాఁడు' అని యాతనిఁ బరుషోక్తు లాడఁదొడంగినప్పుడు కర్ణుం డాతనితో 'మాటలతో నేమి? ఎక్కటి కయ్యంబునకు రమ్ము' అని పిలువ నాతండును గురుననుమతంబునఁ బ్రతిఘటించి నిలిచిన నిర్వురకిని ద్వంద్వయుద్ధ మారంభమయ్యె.

అప్పుడు కర్ణుం డొక్కింత యస్త్రబలంబును నెఱపుచు నూపు నెడ నంతదనుక నెచ్చోటనో యొకమూలనుండి యప్పుడేమో పడిపోయినదని లేచివచ్చి కృపాచార్యుఁడు యుద్ధప్రారంభమున నడుగవలసిన కులగోత్రాదికంబులను యుద్ధసామర్థ్యంబునఁ దన సమ్మతనంబున నవ్యాసనవ్యంబుల గుర్తింపనేరక యడిగినఁ గర్ణుండు తిరిగి యీకష్టమే సంభవించెఁగదా యని చెప్పుటకు నోరాడక క్రిందుచూచుచుండెను. ఆసమయంబున దుర్యోధనుండు కర్ణుని బలం బెఱింగి యర్జునునకుఁ దగువాఁడని తన స్నేహమునకు రాఁ బట్టుకొననెంచి, కృపునితోఁ బ్రతిపక్షులుగు రాజులను జేసోఁకిని యంతఁ బోనీక—

గీ. రాజనందనుఁడైన సోదరుతో ౹ రాజు గాని
యీతఁ డని చేయఁగాఁ దగఁ ౹ డేని నేని
నెల్లవారును జూడంగ ౹ నిస్సభాబు
రాజుఁ జేసెద నే నంగ ౹ రాజ్యమిచ్చి.

భా. ఆది. షష్ఠా. ప. ౮౬

అని పలికి రాజుగా నొనర్చి నిండుసభయందు నవమానము రానీకుండఁ గాపాడె. అందుకుఁ గర్ణుండు ప్రజల విశ్వాసము గలవాఁడగుట దుర్యోధనుని జేరంజని—

కం. దీనికి సదృశముగా మఱి
యేనేమి యొనర్తు నిక ౹ నిష్టం బనినన్

మానుగ నాతోఁ జెలిమి పు
ష్టానుగ్రహముగఁ జేయు మిదియ యిష్టము నాకున్.

భా. ఆది. షష్ఠా. ప. ౫౦

అని దుర్యోధనుండు పలుకుటవలన నాతనితోఁ గర్ణుఁడు చెలిమి యొనర్చినాఁడు. పలుకుటకు మాత్రమే చెలిమి యొనర్చినాఁడా? లేదు. లేదు. తనకుఁ బరాభవము రానీకుండఁ గాపాడినందుకై చెలిమి యొనర్చినాఁడు. ఇందుఁ దప్పున్నదేమో విచారింపుఁడు. ప్రాణములు గాచినవానికిఁ బ్రాణము లర్పించుటయే యాతని ధీరత్వమును బ్రకటించునే కాని, లోపంబు నారోపింపఁజేయదు.

## ద్రుపద పరాభవము.

ఇందుచేఁ గర్ణుఁడు సేయఁజాలని పని నర్జునుఁడు చేసినాఁడని కర్ణునియం దోటమిని నారోపించుట కేవలము నయవిరుద్ధము. జయాపజయంబులు దైవాధీనంబులు. అది గాక ద్రోణుం డర్జునున కనేక యస్త్రంబు లుపదేశించినాఁడు. కర్ణునకో? అట్టి యస్త్రలాభంబులేదు. ద్రుపదుండు ద్రోణునంతటి పరాక్రమశాలి. ఆతనికి నస్త్రబలంబు మెండు. అయ్యస్త్రంబుల నన్నిఁటిని నుపసంహరించుమార్గ మర్జునునకు ద్రోణునిచే నెఱింగింపఁబడినది. కర్ణున కిట్టిది లేదు. కనుక ద్రుపదునిఁ బట్టఁజాలనందుకై

కర్ణుని యందు దుర్బలత్వము నారోపించి యర్జునునికంటెఁ దక్కువ వాఁడని నిరూపింపఁజాలము. ఏమున్నది? మొదట నేర్చుకొనిన విద్యయా? తనకుఁ దాను నేర్చికొనినది. పరశురాముని విద్యయా శాపభంగమైనది. ఇఁక నాతఁడెట్లు గెలువనోపు? పరశురాముని విద్య భంగపఱచినది యింద్రుఁడు. తేఁటిరూపమును బొందినది యర్జునుఁడు. దీనఁజేసి యర్జునుని గొప్పవానిఁగాఁ జేయుట కొఱకు ద్రోణుఁడేగాక, తాను మిక్కిలి తండ్రియగు వేయి కన్నుల గొనగాఁడను వేయి కన్నులతోఁ ద్రిలోకాధిపత్యంబు సార్థకంబగునట్లుఁ ద్రిలోకంబులుఁ గను ఱెప్పలల్లార్పక పరీక్షించుచు నెక్కడనేనిఁ గించిదాపదకలదని తోఁచినచో సద్దాని నప్పుడే ధ్వంసమొనర్చుచుఁ గాపాడుచుండ నింక నర్జునునకు గెలుప శక్యము గానిదే మున్నది?

## మత్స్యయంత్రము

ఈ యంశమును విచారించు నప్పుడు మూలమును గూర్చి యొకింత విచారించుట మంచిది. ద్రుపదుఁ డేభావముతో యజ్ఞ మొనర్చినాఁడు? ద్రోణుని గెల్వఁగల పుత్రుఁడును, దన్నుఁ బరాభవించిన యర్జునునిఁ బెండ్లాడఁగల కుమారికయుఁ గావలయు ననియే గదా? ఆవిధంబుగనే ద్రౌపదీ ధృష్టద్యుమ్నులు హోమగుండమునుండి పుట్టిరి. ఇఁక ద్రౌపది యర్జునునే కదా వివాహమాడవలసి యున్నది? అగుచోఁ

కర్ణుఁడు మత్స్యయంత్రంబు నెట్లు గొట్టనోపు ? కొట్టినచో విధి వ్రాలు తప్పిన ట్లేకదా? ద్రుపదుని యజ్ఞఫలంబు నశించిన ట్లేకదా? విధివ్రాలు తప్పుట యసంభవమని యెల్లరకును దెలిసిన విషయమే. అదిగాక ద్రుపదుఁడు ద్రౌపది యొక్క యర్జునునకుఁ దక్క నితరులకు భార్యకాదు —— కాఁజాలదు —— అని యెఱింగియు స్వయంవరమును జాటించు టేల ? దీని కేదియో కారణముండక తప్పదు. అవును ఉన్నది. కాదు కాదు: ఉన్నవి. అప్పుడు పాండవులెచ్చోట నున్నదియు ద్రుపదునకుఁ దెలియదుగావున, స్వయంవర మనినచో రాకుమారులగు వారందఱు వత్తురుగావునఁ దన్మూలమునఁ బాండవులఁ గనుఁగొనఁ దలంచుట యొకటి. ఎట్లును ద్రౌపదియర్జునునకే భార్యయగుఁ గావునఁ దా నెట్టి యంత్రమును నిర్మించినను ఫల్గునుఁడు జయశాలియగు ననియుఁ, దదితరము లేవేనియగుచో నితరులకు సాధ్యములగునేమో యనియు, దుస్సాధమగు మత్స్యయంత్రము నిర్మించినచో నర్జునుఁడు దానిఁ గొట్టుట నిశ్చయంబుగనుక తనకుఁ గాఁబోవునల్లుని పరాక్రమంబు రాజచక్రంబు మ్రోల విశదమగుటయుఁ, దన్మూలమున నర్జును నంతటివాఁడు దన వైపున నున్నాఁడను భయంబునఁ బరరాజులెవ్వరుఁ దనపైకి రా సాహసింపరనియు, ననువాని నిరూపించుట రెండవది. ఇఁక స్వయంవరమునకుఁ గృష్ణ బలరాములు వచ్చినారు.

వారల కీవృత్తాంతము తెలియును గావున దాని జోలికే పోలేదు. కర్ణున కీవృత్తాంతము తెలియునో తెలియదో చెప్పజాలము. తెలియక పోయినచో నయ్యది సహజముగాన నాతనియందుఁ దప్పేమియు లేదు. ఒకవేళఁ దెలిసియే పోయెనని యనుకొందము. అగుచో నిది కడుమూర్ఖత్వము గాదాయనిపల్కవచ్చు. కాని కాంతా కనకము లందాసలేని వాఁడెవ్వఁడు? కర్ణుఁడు మత్స్యయంత్రమును దెగవేయలేనందుకు రెండు కారణము లున్నవి. మొదటిది విధినిర్ణయము. రెండవది యాతండు వింట బాణంబును సంధించి సరియగు గురిచూచుకొని విడువఁబోవుతఱి ద్రౌపది 'నాహం సూతం వరయామి' అని పల్కుట. ద్రౌపది యీవిధముగాఁ బల్కినట్లు తెనుఁగు భారతమునలేదు. కాని సంస్కృత భారతమునందున్నది. ద్రౌపది యన్న మాటలు వీనుల సోకినంతనే, యచ్చటఁగూడ సూతపుత్రుండను మాట వినంబడెఁగదా యని—అఖిల రాజచక్రంబు ముందఁ దనకవమానంబు గలిగెఁగదాయని కర్ణుండు నిరుత్సాహుఁడయ్యెను. బాణము గురితప్పెను. ఇది కర్ణుని దుర్బలత్వమును బ్రకటింపఁ గలదా?

ఈస్వయంవర మహోత్సవంబున జరిగిన కర్ణార్జునుల ద్వంద్వయుద్ధమందుఁగర్ణుం డర్జునునితోఁ బోరుసల్పక వెనుదీసిన వాఁడు గావున నీతనియందు నిక్కమగు వీరలక్షణములు

లేదని యనుకొనవచ్చు. అట్లు లనుకొనుటకుఁ బూర్వము స్వయంవర కాలమున నర్జునుని స్థితి యెట్టిదో కొంత విచారింపవలయును. నరుఁడప్పుడు విప్రవేషంబున నున్నవాఁడు. విప్రులమధ్యనుండివచ్చియే మత్స్యయంత్రమును ఛేదించినాఁడు. అక్కడ నున్నవారెల్లరు నర్జునునిఁ గేవలము బ్రాహ్మణుఁడనియే తలంచిరి. కర్ణునకుఁగూడఁ గలసూపు తెలియదు. అదిగాక యుద్ధసమయమునందు దన్నుఁగూర్చి యర్జునుఁడును భూతబ్రహ్మతేజోధికుండనని కర్ణునితోఁ జెప్పినాఁడు. కర్ణునకు మొదటినుండియు బ్రాహ్మణ తేజం బజేయంబని బాగుగాఁ దెలియును. ఒక్క శాపాయుధులగు బ్రాహ్మణులఁ జూచియే యెల్లరును భయపడు చుండ నింక శాపచాపాయుధులఁ గాంచి భయఁపడుటలో వింతయేమున్నది ? అర్జునునిది క్షాత్ర తేజంబని తెలిసి యున్నచో సుక్షాత్ర తేజశ్శాలియగు కర్ణుఁడు వెనుఁదీయఁడు. ఉత్తమ వంశ్యులగు బ్రాహ్మణులయెడ సమ్మానమును జూపుట ప్రశంసానర్హమగునది కాదుగదా ?

## ద్రౌపది మానభంగము.

ఇదియే చక్కగా విచారింపవలసిన విషయము. ఇందు వీరుఁడగువాఁడు నిండు సభయందొక పతివ్రతాశిరోమణికి మానభంగము జరుగనున్న నూరక చూచియుండుట

కేవలము ధర్మ విరుద్ధమనియు, నట్టివాఁడు పిఱికిగాని వీరుఁడు గాఁడనియు నెల్లరు పలుకుచు వీరుఁడగు కర్ణుఁడు చూచియూరకొనుటయేగాక, పసిబాలుఁడగు వికర్ణుఁడొనర్చు ధర్మోపన్యాసమున కాతఁడడ్డు పెట్టిన వాఁడగుటవలన నాతని యందుఁ బ్రబల దోషమ్మారోపింప వచ్చునని చెప్పుదురు. కాని యా సభయందు వీరుఁడనువాఁడు కర్ణుఁడొక్కఁడేనా? ఇంకెవ్వరును లేరా? ఈ విషయమును విచారింపుఁడు. అప్పు డా సభయందు ధర్మస్వరూపులును, వీరాధివీరులును నగు, భీష్మ ధృతరాష్ట్ర విదురాదులును, నాచార్యులగు ద్రోణకృపాదులును, బంచ పాండవులును గలరు. కురువృద్ధులగు భీష్మాదు లందఱును జూచి యూరక యున్నవారలే కాని, యా దుర్నయమును కడ్డు నిలిచి, తగదని తెల్పినవారుగారు. అట్టిచో భీష్మాదులు వీరులు గాని వారలేనా? అగునని యెవరు సాహసించి చెప్పగలరు? వీరసింహులగు భీమార్జునులును జూచియే యూరకుండిరి. వీర లగ్రజునాజ్ఞా బద్ధులగుట వలన నూరకుండిరే గాని లేకున్నఁ గౌరవుల నాశ మొనర్పక యుండెడి వారాయని చెప్పవచ్చు. భీమార్జును లెట్లు ధర్మజుని యాజ్ఞాబద్ధులో, కర్ణుఁడట్లే దుర్యోధనాజ్ఞా బద్ధుఁడు. అగుచో దుర్యోధనుఁడు కర్ణున నూరకుండు మటులాజ్ఞ యిచ్చినాఁడా? లేదు. కాని సేవాధర్మము నాలోచించినచో నట్టి ప్రశ్న పుట్టనేరదు.

దుర్యోధనుని దుర్నయమునకంతకుఁ గర్ణుఁడేకదా మూలమని యనవచ్చు. ఇందది కేవలమసంభవము. ఎట్లందురా? దుశ్శాసనుఁడు దుర్యోధన చోదితుఁడయ్యె యిక్కార్య మొనర్చెనుగాని కర్ణచోదితుండై కాదు. సుయోధనుని కార్యములకెప్పుడు కర్ణుఁడడ్డము సెగులు వాఁడుగాఁడు. అతని చిత్తానువర్తియై మెలంగువాఁడు. ఇదియే సేవాధర్మము. ప్రభునిచిత్తమెఱింగి, తదనుకూలంబుగ వర్తించుటయే సేవకునకుత్తమ లక్షణము. ఇప్పటికిఁ గర్ణుఁడు పీటిడి కాఁడని తేల్చితిమి.

ఎట్లయినను గర్ణుఁడు వికర్ణునకడ్డమేల చెప్పవలె? ఇది తప్పుగాదా? విచారింతము. ధర్మస్వరూపులగు భీష్మాదులుండ బాలునకు ధర్మ మేమెఱుకయని మందలించినాఁడు. వికర్ణునిమాత్రము భీష్మాదులకుఁ దెలియదా? వారేలయూరకొనవలె? అన్ని యధికారములు భీష్మునకుఁగలవు. అతఁడేమి చేతగానివాఁడా? ధర్మము తెలియనివాఁడా? దుర్యోధనునాజ్ఞాబద్ధుఁడా? అతఁడేమి సేవాధర్మమును బాలింపవలయునా? ఇట్టివాఁడేల యూరకొనవలె? అదిగాక వికర్ణుఁడో దుర్యోధనుని క్రిందివాఁడుగాని పైవాఁడుగాఁడు. పెద్దలకుఁదెలియని విషయమగుచోఁ జిన్నలు తెల్పుట స్వాభావికము. ఇందుఁ దెలియని పెద్దలెవ్వరు? మనము కర్ణునియందుఁ దప్పువట్టఁ దలంచినచో ముందు భీష్మాదులయందుఁ దప్పు నిరూపింపవలెను. అట్లు సేయుట కెవ్వరు సమర్థులు?

## దా న ప ర త్వ ము.

ఇఁక దీనినిగురించి చెప్పనదేమున్నది? ఇంద్రుఁడు ప్రాణాపహరణమునకై బ్రాహ్మణ వేషంబునఁ దన్నుఁగవచ కుండలంబుల నడుగుటకు రాఁగలఁడని జనకుఁడగు సూర్యునిచే నెఱింగియుఁదాఁబూనినవ్రతాచరణమునకులోపము రానీకుండ వాసవుఁడు గవచకుండలంబులఁగోరినప్పుడు ప్రాణాపాయమని యెఱింగియు వెనుదీయక దానమొనర్చినాఁడు కర్ణుఁడు. ఇట్టి ధీరత్వ మర్జునుని యందెచ్చటను గానఁబడదు. దానరాధేయుఁ డని పేరేకలదు గదా?

కర్ణుని దానపరత్వమునకుఁ గొందఱు కళంకమాపాదించుచున్నారు. అది యెట్టిది? ఆతఁడింద్రుని యొద్దనుండి శక్తిబాణమును బరిగ్రహించినాఁడట. దానఁజేసి యాతఁడొనర్చినదానము ప్రతిఫలము నాశించినదట. అందువలన నది కళంకమైనదట. ఇది నిజమా? కర్ణుఁడు బిడౌజునకు దానమిచ్చుటకుఁబూర్వము నాకు నీశక్త్యాయుధమిచ్చిన, నాకవచ కుండలంబులు నీకిత్తునని యాతనితో ఘంటాపథంబుగఁ బల్కినాఁడా? లేదు. కాని యింద్రుఁడు, తనకు సూర్యుఁడు చెప్పిన సంగతి యంతయుఁ దెలియుననియు, నావిధముననే తనకుఁ బ్రియంబు సేయుమనియుఁ గర్ణునితోఁ జెప్ప నాతండును నట్లే

కానిమ్మని ప్రత్యుత్తర మొసంగె. సూర్యుని యాజ్ఞాప్రకారము వారిద్దఱును మెలంగువారు. అందువలన దానమునకుఁ గళంక మెట్లువచ్చును? ఒకవేళఁ గళంకమే యున్నచో ధర్మస్వరూపు లగు దేవతలు కర్ణుని దానపరత్వమును గీర్తించి పుష్పవర్ష మును గురియింతురా? మెత్తురా? ఇంద్రుఁ డెల్లప్పుడు పాండవ పక్షపాతి. ఇదివరకు వేనకువేలు శత్రువులను నుఱు మాడిన శక్త్యాయుధంబును, గర్ణునకిచ్చు నప్పుడు కర్ణా! ఇది నీకుఁ బ్రాణాపాయకరమగు సమయమందొక్క శత్రువునిఁ జంపుటకే యియ్యది సహాయపడునని యింద్రుఁడు పలికి నాఁడు. ఇందును తన స్వార్థపరత్వమునే చూపించినాఁడు పాక శాసనుఁడు. ఎట్లు విచారించినను గర్ణుని దానమునకుఁ గళం కములేదు. ఉన్నచో దానరాధేయుఁడను బిరుదమాతనికి లభింప నేరదు.

## రా జ భ క్తి.

ఇంక రాజభక్తినిఁ గూర్చి విచారింతము. కర్ణునకు మిత్రుఁడైనను, రాజైనను, దుర్యోధనుఁ డొక్కఁడే. అర్జును నకు రాజైనను, అన్నయైనను ధర్మజుఁ డొక్కఁడే. ఇందు వీరి ద్గతి రాజభక్తినిఁ గూర్చి విచారింతము. కృష్ణుఁడు రాయబార మునకు వచ్చినాఁడు. కర్ణు నొంటిరిగాఁ బిలిచి యాతని జన్మ

వృత్తాంతమును జెప్పినాఁడు. 'పాండవాగ్రజుండవు గనుక పాండవుల వైపునకు రమ్మని' కోరినాఁడు. కోరుటయేగాక సర్వమహీతలంబునకు రాజుగా నొనర్చెదనని యాసపెట్టి నాఁడు. పాంచాలి యతని సొత్తనిపల్కినాఁడు. ఇట్టులెన్నియో యాసలు చూపినాఁడు. కర్ణుని మనంబు చలించినదా? రాజభక్తి కేమేని లోపము వచ్చినదా? అంత మాటయే! కృష్ణున కాతఁ డొసంగిన ప్రత్యుత్తరమేమి?

కృష్ణా!

ఉ. సూతసుతుండు వీఁడనక । సూనుల నిమ్ములకంటె నాపయిం
బ్రీతి యొనర్చి తేజమును । పెంపును నాఁటికి నాఁటి కగ్గలం
బై తనరార నన్నుఁ దన । యంతటివానిగఁ జేసియుండ నే
నేతగవూది యీ కురుకు । లేశ్వరుఁ బాయుదు ముట్టవచ్చినన్.

కం. నను నయ్యర్జునునకు నెదు
రని పెద్దయు నమ్మియుండు । నక్కట సుయో
ధనుఁ డా నమ్మిక వమ్ముగఁ
జనునే పాండవులఁ గలయఁ । జన నాకనఘా.

భా. ఉద్యో. చతు. ప. ౩౯–౪౦

అని పలికి తన నిర్మల రాజభక్తినిఁ బ్రకటించినాఁడు.

అర్జునుని రాజభక్తి యెట్టిదో చూతము. ఆతనికి రాజు ధర్మరాజు. ఎల్లప్పుడు ధర్మజుని యందు నిర్మలభక్తి

గలవాఁడేనా యర్జునుఁడు? అగునుగాని కొద్ది కళంకము మాత్రముగలదు. అదియెట్టిది? కర్ణుని నర్జునుఁడు సంపకయే తన యొద్దకు వచ్చినప్పుడు తా నదివఱకుఁ గర్ణునిచేఁ జావు దెబ్బలు తిని యున్న వాఁడు గావున, ధర్మజుఁడర్జునునిపైఁ గినిసి "నీగాండీవంబు హరికిచ్చి నీవుసారథ్య మొనర్చినచో నాతఁడప్పుడే కర్ణునిఁ జంపియుండుఁగదా?" యని పల్కినాఁడు. ఆక్షణముననే యర్జునుఁడాతని తల నరుకఁబోయినాఁడు. రాజభక్తికిఁ గళంక మాపాదించినాఁడు. ఆ! ఆ! అంతమాటయే. అట్లుగాదు. ఎన్నండైనఁ గలలోనైనను ధర్మజునిపైఁ గోపమెఱుంగని యర్జునుఁడు నేఁడే కారణంబుగఁ దల నరుకఁబోవునా? దీని కేదియో ప్రబల కారణ ముండితీరవలె. అవును. ఉన్నది. అదియేది?

క. నిను మొదలడుగ గాండీవ మి
త్తురని నన్నెవ్వండు వలికె నతని శిరముఁ ద్ర
వ్వ్కనఁ బగుల వేయుటకుఁ జే
సినవాఁడఁ బ్రతిజ్ఞ నాదు చిత్తములోనన్

భా. కర్ణ. త్వ. ప. ౬౩

అని యర్జునుఁడు దానూనిన ప్రతిజ్ఞను దెల్పుటయే. దీనిని బట్టి చూచిన నాతని భక్తికిఁ గళంకములేదు ఎట్లు? సుక్షత్రియునకుఁ బ్రతిజ్ఞాపాలనము పరమ ధర్మముగదా? అగుచో నర్జునుఁడు గృత ప్రతిజ్ఞుఁడు గాలేదు. అందువలన నిం

కొక దోషము తటస్థించినది. ఎట్లు? ప్రతిజ్ఞ ప్రకారము ధర్మజుఁ జంపలేదుగదా? కాని యిక్కడ శ్రీకృష్ణుఁడు దనకుఁ దెలిసిన శుక్రనీతి సారమంతయు నొక్క పెట్టున నర్జునునకుఁ దెల్పి, నాలుగు తిట్లు ధర్మజుఁదిట్టి మరుక్షణమున నాతని కాళ్లు పట్టుకొనినచో నతఁడు గృతప్రతిజ్ఞుఁడగునని తెల్పినాఁడు.

అర్జునుఁ డట్లులనే యొనర్చినాఁడు. ఆహా! సత్యవాక్పరిపాలన మెట్టిది? నాలుగు తిట్లతోఁ బ్రతిజ్ఞా పాలన మయిపోయినది. ఇంత సూక్ష్మ సూనృత పరిపాలనా రహస్య మా నలహరిశ్చంద్రులకుఁ దెలిసియే యున్నచోఁ గష్టములే యుండవుగదా? బలిచక్రవర్తికిఁ బాతాళలోక వాసమే సిద్ధింపదుగదా? కాకున్న అప్పటి యిప్పటి సత్య ధర్మమున కేమైన మార్పు కలిగినదేమో? ఆకృష్ణ పరమాత్మునికే యెఱుక. కాని కర్ణుఁ డెచ్చటను నిట్టి పరమ ధర్మమార్గమును త్రొక్కి యుండలేదు. కనుక కర్ణుని యందీ లోపమును, నర్జునుని యందీ ఘనతయును మనకు బాగుగాఁ గనుపించుచున్నవి. ఇంక—

## మాతృప్రేమ.

కర్ణార్జును లిర్వురును గుంతి కొడుకులే. అర్జునుని మాతృ ప్రేమ యసమానమే. అవును. తన్నుఁగని, పెంచి, పెద్దవానిఁగాఁ జేసిన తల్లిపై నట్టి ప్రేమ సూపుట సహజమే

గదా? ఇంకఁ గర్ణుని సంగతియో? కుంతి యాతనిఁ గనినది. నిర్దయురాలై నదీ గర్భమున విడిచినది. పెంచలేదు. పెద్దవానిఁగాఁ జేయలేదు. అయినను గర్ణునకుఁ గుంతి యందుఁ బ్రేమలేదా? ఉన్నది. అయ్యది యద్వితీయము. అర్జునుఁడు తన మాతృప్రేమను తన నడవడిచేతనే వెల్లడిచేసినాఁడు. కర్ణుఁడో? తన ప్రాణములనే యొసంగి మాతృఋణమునుండి విముక్తుఁడైనాఁడు. ఎట్లు? "పాండవులు నేవడిఁ గేనిఁ జంప"నని యామెకు వర మొసఁగి తానుగాక యామె కైదుగురు కొడుకు లుండునట్లుగఁ దన ప్రాణముల నర్పించినాఁడు. కుంతియు నతని జన్మవృత్తాంతంబును జెప్పి పాండవుల వైపునకు రమ్మని యెన్ని విధములనో ప్రతిమాలినది. కాని కర్ణుఁడు చెప్పిన ప్రత్యుత్తరమేమి?

ప ద్య!

ఆ. విజయు విక్రమంబు ॥ విఖ్యాతమై యుండ
నేను గుంతికొడుక ॥ భానుఁ డుండ
ననుచు నతనిఁ జేర ॥ నరిగిన నతనికి
నిచ్చి పోయినదని ॥ వేయునేల.

భా. ఉద్యో. చతు. ప. ౬౮

అని తన ధీరత్వమును బ్రకటించుటయే గాక సేవా ధర్మమును జక్కఁగాఁ బోషించినాఁడు. తానెప్పు డర్జునునకు

వెఱుచువాఁడు గాఁడని నిరూపించినాఁడు. ఇంక భ్రాతృ ప్రేమను గూర్చి—

## భ్రాతృ ప్రేమ.

ధర్మజుని యందర్జునుని కన్నఁ గర్ణునకే యెక్కుడు ప్రేమగలదు. కృష్ణుఁడు తన జన్మ రహస్యమును చెప్పు నప్పుడు కర్ణుఁడా రహస్యము ధర్మజునకుఁ దెలియకుండునట్లు "రహస్యము రక్షితముగఁ బాటింపుమయ్యా చిత్తములోన" అని కృష్ణునకు హెచ్చరికఁ జేసినాఁడు. ఎందులకు? తాను ధర్మజున కగ్రజుండని తెలిసినచో,నాతఁడు సామ్రాజ్యమును గోరఁడనియు, నట్టి ధార్మికుఁడు రాజ్యాధిపత్య మూనకుండు నట్లొనర్చుట కేవలము ధర్మవిరుద్ధమనియు, నెఱిఁగినవాఁడు గావుననే యట్లొనర్చినాఁడు. దీనఁజేసి కర్ణునకు ధర్మజుని యందెంత ప్రేమగలదో తెలియుచున్నది.

ఇఁక ధర్మజునిపైఁ గలభక్తినిఁ దిలకింపుడు. తాను పాండవవిరోధి. ఎల్లప్పుడు కౌరవుల మేలుగోరువాఁడు. అయినను గర్ణునకు దూరాలోచనము గలదు. కావుననే శ్రీకృష్ణునితో, ధర్మరాజు, తన యనుజులే ఋత్విజులుగను, కృష్ణుఁడే యుపద్రష్టగను, కురుకుమార వర్గమే పశువర్గముగను, జేకొని రణయజ్ఞ మొనర్చుననియు, దానఁ గురుక్షేత్రము పుణ్యభూమి

యగుననియు, నందుఁ దనవంటివారి కెల్ల సద్గతికలుగుననియుఁ దెల్పినాఁడు. ఇది కర్ణునకు యుధిష్ఠిరునందుగల భక్తితాత్ప ర్యమును సూచించుట లేదా?

## బంధు ప్రేమ.

కర్ణుఁడు పుట్టుకతోడనే తల్లినిఁబాసి సూతగృహంబునఁ బెంపఁబడినాఁడు. అర్జునుఁడుగడు బాల్యమునందే పితృవిహీనుఁడై భీష్మునిచేతఁ బెంపఁబడినాఁడు. వీరలిద్దఱును దమ్ముఁ బెంచిన వారల ఋణములను దీర్చుకొనిరా? శ్రీకృష్ణుఁడు దన్ను బాండవులఁజేర రమ్మనిపిలువఁ గర్ణుండు, తన్ను బాల్యంబునుండియు మూత్రపురీషాదులకు లోనగుచుఁ గన్నపుత్రునిగతి రాధ పెంచినదనియు, నట్టివారలను నేఁడు కాదని, యొరుల పంచఁజేరుట తగవుకాదనియు నట్లొనర్చినచో వారల ఋణమును దాను తీర్చుకొనలేఁడనియు, నింతవఱకును సూతకులంబువాఁడని యెన్నఁబడుచు నింతలో సుక్షత్రియకులంబువాఁ డని తెల్పుట నగుబాటునకు మూలమనియుఁ దెల్పి తన బంధు ప్రేమను వెల్లడిచేసినాఁడు.

ఇఁక నర్జునుఁడో? తన్ను జిన్నతనము నుండియుఁ బెంచి పెద్దవానిఁగాఁజేసి, విద్యాబుద్ధులు గఱపించినట్టి తాతయగు భీష్ముని-స్వయముగా వెళ్లి యాతనివలననే యాతని చావు

నెఱింగి శిఖండినెదుటఁ బెట్టుకొని యామిదుసలి ప్రాణములం గొని, యాతనిఋణమునుఁ నిశ్శేషముగా దీర్చికొనినాఁడు. ఇదియే వారికిఁగల బంధుప్రేమ.

## అభిమన్యుని వధ.

ఈ విషయమునందుఁ గర్ణుఁడు కేవలము పిఱికివాఁడై ప్రవర్తించినాఁడను పలు కచ్చటచ్చట వినంబడుచున్నది. ఇది యెంతవఱకు నిజమో కనుగొందము. పదుగు రొక్కసారి పైఁబడి చంపునట్లు దెల్పినది ద్రోణుఁడు. అందుఁ గర్ణుఁడొనర్చినది వెనుకపాటుననుండి కత్తిని విఱచుటయే? ఇదియేకదా తప్పని చెప్పునట్టి కృత్యము. ఇందేమి తప్పు కలదు? కపటోపాయంబు సంగర ధర్మములలోనిదేకదా? అదిగాకున్న భేదోపాయంబునే ప్రయోగించెనని యేల యనుకొనఁగూడదు? ఇందు భేదపఱచుటకు వ్యక్తు లెచ్చట? అను ప్రశ్న పుట్టుచున్నది. ఒక చిన్న యుదాహరణము. ఒకానొక మహారణ్యమార్గంబున నొక రాకుమారుం డశ్వారూఢుండై పోవుచుండెనని యనుకొనుఁడు. ఆ సమయంబున నాతని మేలు గోరు వృద్ధుఁ డొకఁ డాతని కగపడి 'కుమారా! ఈమార్గంబున శత్రువులు నిన్ను వెంటాడుచున్నారు. పోవలదు' అని పల్కినప్పు డాతఁ డేమనును? ఆర్యా! ఈ కరవాలంబు నా చెంతనుండ శత్రు

వులు నన్నేమి చేయఁగలరు? అని జవాబొసంగును. ఇం దాతని యభిప్రాయమేమి? అతని కరవాలంబే యాతని కొక వ్యక్తి యెట్టుల సహాయ మొనర్చునో యాగతిని దనకు సహాయ మొనర్చుననియే కదా? ఇందుఁ గరవాలమునకు వ్యక్తిత్వ మారోపింపఁ బడుచున్నది. అప్పుడు రెండు వ్యక్తులగు చున్నవి. రెండు వ్యక్తులున్నచోట భేదోపాయము ప్రయోగింపఁబడుచున్నది. రెండు వ్యక్తులేల? రెండు వస్తువు లున్న చోటనే భేదోపాయమునకు మార్గమున్నది. కావున నభిమన్యునియందు నిట్టులనే భేదోపాయము ప్రయోగింపఁబడినది. భేదోపాయంబునందుఁ గపటంబుగూడ నుండును గనుక కర్ణుని యందుఁ దప్పేమియు లేదు. భీష్మ ద్రోణ సైంధవాదులవధ వోలెఁ గర్ణుఁ డెంతమాత్రము తప్పుమార్గమును ద్రొక్కలేదు.

## శల్య సారథ్యము.

కర్ణుని ప్రాణములను హరించిన మహాత్ములలో నీతఁడు పంచముఁడు. ఇందు గమనింపవలసిన విషయములు పెక్కులు గలవు. శల్యుఁడు దుర్యోధనుని కపటంబున నాతని పక్షంబు బోనివాఁడై పాండవులను జూడ నరిగినప్పుడు మేనల్లుఁడగు ధర్మనందనుఁ డాతనికిఁ గల్గిన భంగపాటునకుఁ గొంతవడి విచారించి తుదకు మామా! దైవోపహతుండవై నీవు మా

వై పునకు రాఁజాలవైతివి. అయినను సమయము వచ్చినప్పుడు సంగరంబున నర్జునుని నొక్క కంటఁగనిపెట్టి యుండుము అని కోరినాఁడు. అతఁడొప్పుకొనినాఁడు. ఇట్లడుగుటలో ధర్మజుని పిఱికితనము స్పష్టముగాఁ బ్రకటీకృతమగుచున్నది. ధర్మజుఁ డెల్లప్పుడు కర్ణునిఁ గూర్చియే కదా భయపడుచుండెడివాఁడు? కర్ణార్జునుల యుద్ధమప్పుడు శల్యునకేదేని సమయంబు చిక్కినప్పుడు కర్ణునకెగ్గాచరించి యర్జునునకు లగ్గాచరింపుమనియే కదా యిందుఁగల ధర్మజుని యభిప్రాయము? ఇది కేవలముఁ వీరధర్మమునకు విరుద్ధముగాదా? నిక్కముగ వీరుఁడైనచో ధర్మజుఁడట్లుకోరునా? ఒకవేళ తమవాఁడగు శల్యుని బగతుడు వంచించినారు కావునఁ దాము వంచించుటయు సమంజసమేయని యనుకొనవచ్చు. కాని శల్యుని వంచించినదెవఁడు? దుర్యో ధనుఁడు. ధర్మరాజడిగినది కర్ణునిఁ గూర్చి. ఇందేమైన సంబంధముకలదా? వంచించినవారొకరు—తత్ఫలంబు ననుభవించు వారొకరునా? భీమదుర్యోధనుల గదాయుద్ధమప్పుడు సమయము చిక్కినచో మామా! భీమునొక్కకంటఁ గనిపెట్టి యుండుము అని ధర్మజుఁడేల యడుగఁగూడదు? ఇదియంతయుఁ గర్ణునిఁ జంపుటకై పన్నిన పన్నుగడయే గదా? ఇదియేనా శూర లక్షణము? ఇదియేనా యుధిష్ఠిరుని ధర్మము?

ఇఁక శల్యుఁడో? కర్ణుని చావుకుఁ బంచముండగు నా మహాత్మునిఁ గూర్చి చెప్ప టనవసరమే. అయినను నీతనియం

దాక గొప్పతనమున్నది. తానొసంగిన వాగ్దానమును బాటించుటయందు ద్రోణునికన్న రెండాకు లెక్కువ చదివినాఁడు. అశ్వగతి నెఱుంగుటయందుఁ గృష్ణుని కీడగువాఁడు శల్యుఁడని పాపము! కర్ణుఁడాతని సారథిఁగా నియమించుకొనినాతఁడు చేసినదేమి? సారథియై తన రథికుని ననేకవిధంబుల సమరంబునకుఁ బురికొల్పుటమాని రథికుని యుత్సాహమునకే విఘ్నకరంబులగు వాక్యంబులు వల్కియు నర్జునుని పరాక్రమం బుగ్గడించియు, నాతనిఁ దూలంబలికియుఁ, దానొక పెద్ద శాస్త్రవేత్తవోలె హంసకాకీయోపాఖ్యానంబు వినిపించియు ననేక విధంబులఁ గర్ణుని సహజపరాక్రమోత్సాహంబును బాడొనర్చినాఁడు. అంతేగాక తుదకుఁ గేవలము పాండవపక్షపాతియై యెన్ని దినంబులనుండియో పూజించుకొనుచు భద్రముగాఁ గాపాడుకొనుచున్న సర్పముఖశరంబు నప్పుడు వింటఁదొడిగి యర్జునుని కంఠనాళమునకు గురిపెట్టికొట్టఁ బోవ నీచుఁడగు శల్యుఁ డద్దాని గురికి విఘ్నం బొనర్చి యెక్కుడు పైకి గురినిల్పునట్లొనర్చె. అక్కడికి శ్రీకృష్ణుండు రథంబు నెంత క్రిందికి నణఁగఁద్రొక్కినను నద్దాని చేత నర్జునుని కిరీటంబు పుడమింగూలె. ఆశరంబట్లు నాతనిచే విఫలమైపోయె. కేవలము సుక్షత్రియుఁడగు శల్యున కింతటి దురవస్థ యేలకలుగవలయునో? ధర్మజుని కొసంగిన వాగ్దానమును బాలించుట

కేనా ? అగుచో రథికుని వేయికన్నులఁ గాపాడవలసినట్టి సనాతధర్మమున కొడంబడి యట్టిధర్మంబును మంటగలుపు కెట్టులాయని చింతింప లేకపోయినాఁడు కాఁబోలు? అవును. ఎట్లు చింతింపఁగలఁడు? మేనల్లుఁడగు ధర్మజు నంతటివాఁడు నోరుదెఱచి 'మామా' యని పిలిచి తన్నడిగినాఁడుగదా యని యుబ్బిపోయి చిత్తజ్ఞానశూన్యుఁడై పోయినాఁడు. కన్నతల్లియే విషం బొసంగినఁ గాపాడువా రెవ్వరు ?

ఆరవవాఁడగు కర్ణుని విషయంబు విచారింతము. కర్ణార్జును లిద్వరు దారుణంబుగఁ బోరు సల్పునెడ బాల్యంబున నకారణంబుగఁ గలిగిన విప్రశాపంబు కతంబున గర్ణుని రథంబు డాపటికల్లు భూమిలోఁ గ్రుంగిపోయె. ఇఁకఁ గర్ణుఁడు రథము మీఁదనుండి యుద్ధమొనరించు టెట్లు? పాపము! అతండరదంబు డిగ్గి చక్రంబు నెత్తఁజూచెఁగాని పుడమి లేచెనేగాని చక్రంబు కదలదయ్యె. ఆసమయంబున నర్జునుఁడు కృష్ణప్రేరితుఁడై తగుదునని భూమిస్థుఁడగు గర్ణుని బాణంబులఁ గొట్టుచుండె. భూమిస్థుఁడు రథస్థునితోఁ బోరు టెట్లు? అప్పుడు కర్ణుఁడు——

అర్జునా!

విరిదలవానిని, విరథుని నాయుధం బిడినవానిని
శూరులేయరెము...........

అని రణధర్మమును హెచ్చరికఁ జేసినాఁడు. అర్జునుఁడుత్తమకులుఁడే? రణధర్మకోవిదుఁడే? అట్టివాఁడే రణధర్మమును బాటింపఁడయ్యె. ఇదియేనా యర్జునుని రణధర్మపాండిత్యము? పోనిండు. విప్రశాపంబగుటవలనఁ గర్ణుని రథంబు పైకిలేచుట దుర్ఘటంబు—దానికై వేచియుండుట నిష్ప్రయోజనంబు—అని తలంచినచో శూరధర్మమును బాటింపవలసినట్టి యవస్థయం దేల భూమిస్థుఁడై యాతనితోఁ బోరఁగూడదు? దుర్యోధనుండును దను కెగ్గాచరించెననియు, నందుల కాది కర్ణుఁడేయనియుఁ గృష్ణుఁడు తెల్పిన మాత్రమున ధర్మము నతిక్రమించుటయేనా? అగుచో నతనిని ధర్మపరుఁడని చెప్పుటెట్లు? గదాయుద్ధంబున నూరుభాగంబునఁ గొట్టుట తద్ధర్మవిరుద్ధమైనను భీముఁడట్లు ప్రతిన వట్టుటచేఁ దత్ప్రతిజ్ఞాపాలనమున కట్లొనర్చినాఁడని సమర్థించినారు. ఇచ్చటఁగూడ నర్జునుఁడట్లే తానుగూడ రథమునుమీఁదనుండియే కర్ణునిఁ జంపుదునని ప్రతిజ్ఞ చేసియుండెనా? అటు లెచ్చటను గానరాదు. అయిన నర్జునుని ప్రతిజ్ఞాపాలనమెట్టిదో యందఱికిని దెలిసిన విషయమే. ఏవిధముగఁ జూచినను నర్జునుఁడు రణధర్మము నతిక్రమించియే జగద్విఖ్యాతపరాక్రమశాలియగు కర్ణుని ప్రాణముల హరించినాఁడు.

## కర్ణార్జునుల యాధిక్యము.

ఇప్పటికిఁ గురుక్షేత్రసంగ్రామ మూలకారణులగు కర్ణార్జునులయందుఁగల లోపముల సమగ్రముగా నెఱింగితిమి. గుణంబుల నిరువురును సమానులే. మాతృ భ్రాతృ ప్రేమల యందు మాత్రము కర్ణుఁడెక్కువయనియే యూహింపవలయును. కర్ణునియందు దానవీరత్వము కళంకరహితము. అర్జునుని రణవీరత్వము కళంక సహితము. ఎట్లు? ఈతఁడు రణధర్మమును బాటింపకుండుటయే. అదిగాక రణవీరత్వమున నర్జునుఁడు గర్ణు ననేకమారు లతిక్రమించినను దాను గూడఁ గర్ణుని రణవీరత్వమున కొండొకప్పుడు లొంగిపోయినాఁడు. అదియెట్టిదనఁ గర్ణుని రెండవ నాఁటి యుద్ధ మందర్జునుఁడు కృష్ణునిఁజూచి——

గీ. పట్ట పగలింటి సూర్యుని పగిదిఁ గర్ణుఁ
డుగ్రమూర్తియై వెలుఁగుచు నున్నవాఁడు
మనరథం బిడ్డు మాధవ! మరలనిమ్ము
బ్రదికి యుండిన శుభములు వడయవచ్చు.

అని పలికినాఁడు. రణరంగమున భీభత్సుఁడేయని పేరొందిన ఫల్గునునిపట్ల నిది కేవలము గొప్ప మచ్చగాఁ గనుపించుచున్నది. సుక్షత్రియ పౌరుష ప్రధానునకు రణరంగ

మున నింతగా బ్రదుకు తీపియున్నచో నాతఁడు కేవలము పిరికి వాఁడనియే యెన్నఁబడును. అర్జునుఁడు బ్రతికియుండిన శుభములు వడయవచ్చునని పల్కి తనకుఁ బ్రాణములపైఁ దీపి యుండని లోకమునకుఁ జక్కఁగా వెల్లడించినాఁడు. అతనికిఁగల వీరత్వమున కదియొకసహస్రాంశమునకును రానియల్పవిషయమని త్రోసివేయఁదగునా? దొంగయని పిలువంబడుటకుఁ బదిసారులు దొంగిలించు టేల? ఒక్క సారియే చాలును. ఇంతయేల? ముందు వారలఁ బిలుచుపదములనే విమర్శింపుడు. 'కర్ణార్జునులు'. ముందు కర్ణుఁడు తరువాతనే యర్జునుఁడు. దీనికి వ్యతిరేకముగఁ బదములు కూర్పఁబడఁగలవా? అన్నిఁటికంటె ముఖ్యమైనది కర్ణుఁడులేని భారతమున్నదా? అను నానుడియే చాలును. ఇప్పటికీ యంశమును నొకమాదిరిగాఁ జక్కఁగా విమర్శించితి మనియే యనుకొనవచ్చు. ఇం దెవరికాధిక్య మీయఁదగునో చదువరులే యూహించుకొనదరుగాక!

# ద్రౌపది గుణ శీలములు.

౨౫—౩—౧౯౨౭.

## ౧. భారతభూమి.

శ్రీమదఖిలజలధివలయిత ధరణీచక్రంబునఁగల యుత్తమ దేశంబుల భారతదేశంబు పౌరాణిక కాలంబునుండియుఁ గవితా ప్రపంచము నందేమి, శాస్త్రపరిచయ మందేమి, మత సాంఘిక రాజకీయ విషయములందేమి, యన్నిఁటియందు నత్యుత్తమమైనదే యని పేర్కొనంబడుట వినియుంటిమి. వినుటయేగాక కనులారఁ గాంచు చుంటిమి. ఈ భారతదేశ లక్ష్మి యనేక పుణ్యనదీ తోయంబుల జలకంబులాడియు, నా సేతు హిమాచలంబువఱకుంగల వివిధజనుల జీవనాధారభూతములగు సస్యక్షేత్రంబుల విహరించియు, సంతత పతిసేవా పరాయణ మానసలగు మానినీ శిరోమణుల పరమ పవిత్ర చరిత్రంబులఁ బెక్కుభంగులఁ గీర్తించు సుకవుల కవితారసంబులఁ గ్రోలియు, స్వదేశ స్వమత స్వజాతి స్వగౌరవ రక్షణంబునకై మేనికండల నర్పించి నిజసేవా ధర్మమును బా

---

నెల్లూరునందు జరిగిన తిక్కన జయంత్యుత్సవ సందర్భమున చదువఁబడిన వ్యాసములలో నీవ్యాసము బంగరుపతకమును బడసియున్నది.

లించిన రసపుత్రుల విజయ లక్ష్మీస్వరూపంబున వరించియుఁ జెక్కు తెలుంగుల వాసికెక్కి యున్నది. ఇట్టి విభవాభిరామ మగు నీ భారతభూమినిఁ గడచిన యుగత్రయమున నెందఱో పతివ్రతామతల్లులు పెంపొంది యుండిరి. అంగనాకులమునకు మార్గదర్శినులై యుండిరి. అట్టి పతివ్రతామణులయందు ద్రౌపది యహల్య, తార, తార, మండోదరి మొదలగు నియ్యేవురుఁ గేవలము సత్యస్వరూపలనియుఁ దన్నామ సంకీర్తనంబు సకలదురిత హరంబనియు, వేదవిదులగు మునిసత్తములు వాకృచ్చి యుండిరి. మహాత్ముల వాక్యములెయ్యెడల నిరర్థకంబులు గానేరవు. కాని సహజముగ జగమునఁ బైనుదహరింపఁబడిన సుదతులు సదమలచరితలు గారనియు, నొక్కొక్కరియం దొక్కొక్క కళంక మున్నదనియు, మునులపలుకులిందుఁ గేవలము ధర్మబాహ్యములనియు సచ్చటచ్చటఁ గొందఱు వివేకులు వాకృచ్చుటయుఁ గలదు. కావునఁ బ్రస్తుతాంశమునకు మూలకారణ యగు ద్రౌపది పైనిఁ దెలుపంబడిన సుదతుల నుండుటవలన నామె పవిత్ర చరిత్రంబునకు జను లారోపించు కలంకమెయ్యదియో కనుంగొని, యద్దానిని గ్రంథాధారంబులవలననేమి, తదితరంబులవలననేమి, శక్త్యనుకూలంబుగ విచారించి, నిష్కళంకయని నిరూపించియే యా మహాసాధ్వి గుణశీలంబుల నెఱుంగుట యుక్తము.

## ౨. జనాభిప్రాయము.

'జనవాక్యంతు కర్తవ్యమ్' అనియెడి నానుడి వడువునఁ బ్రస్తుత కాలంబునఁ బేరుగల పండితుఁ డెవ్వఁడేని 'ద్రౌపది పతివ్రత కానేర'దని తెలిపినచో నందలి నిజానిజంబుల విచారింపక 'యో- యంతటివాఁడు సెప్పిన దానియం దబద్ధముండునా' యని 'అవును. అది నిజమే' యని తమ యంగీకారమును వెల్లడించు సుజ్ఞానులు గొందఱు గలరు. ఆమె పతివ్రత కానేరదని తెల్పు వారలకుంగల యాధారము లామె కేవురు పతులుండిరనియుఁ గర్ణునిపై నామెకు మనస్సు గలదనియు నై యున్నయవి. ఈ రెంటను బ్రస్తుత కార్యమునకు విచారింపవలసిన విషయములే. సుగుణశీలయగు ద్రౌపది కేవురు పతులుండుటకుఁ గారణమేమి? ఇయ్యది కులాచారంబునకు విరుద్ధంబుగాదా?

'నొసటన్ వ్రాసిన వ్రాలు కన్నఁ గలదా? నూరేండ్లు చింతించినన్' అను వచనానుసరణి నుదుటి వ్రాలును జెరుపఁగల బ్రహ్మదు లెవరుగలరు? ఇమ్మానినీ శిరోమణి కేవురు పతులుండుట కామె పూర్వ బహుళజనన సుకృతఫలంబే కారణంబు గాని యన్యంబుగాదు. ద్రౌపది తొల్లింటి జన్మంబున నాళాయనియైన యింద్రసేన యనంబరగిన పరమపతివ్రత

యనియుఁ గుష్ఠవ్యాధి బాధిత త్వగస్థిభూత శరీరుండగు మౌద్గల్యుండను మహామునికి భార్యయై, పరమ భక్తిం బతిని నారాధించుచుఁ దదుచ్ఛిష్టంబును భుజించుచు నంతంబునఁ గొంతకాలంబు కామోపభోగంబుల నాతనివలన ననుభవించియుఁ దనివి సెందక, శరీరంబు దొఱంగిన యనంతరంబు కాశిరాజను రాజర్షికిఁ బుత్రికయై కన్యాత్వంబునఁ బెక్కు ప్రొద్దులు గడపి తన దౌర్భాగ్యంబు కతంబునఁ దగినపతిఁ బడయ నేరక పశుపతిం గూర్చి ఘోరతపంబు సేయుచున్న సమయంబున—

గీ. దానికపుడు బ్రత్యేకంబ । ధర్మవాయు
వాసవాశ్వినుల్ ప్రీతులై । వచ్చి దాని
నాత్మదేహాంశజులకు దే । హాంతరమునఁ,
బత్నిఁగాఁ గోరి రధిక । సౌభాగ్యయుక్త.

ఇట్లు వారలు తమతమసుతులకు నయ్యతివ సతిగావలయునని కోరియరుగుటయు, నంతఁ బెద్దగాలంబునకు నీశ్వరుండు ప్రత్యక్షంబై వరంబు వేఁడుమనుడు నమ్మగువయుఁ బతిదానంబనుగ్రహింపుమని యర్థిత్వంబున నేను మాఱులడుగుటయు నందులకాతండియ్యకొని జన్మాంతరమున నేవురు పతులగుదురనియుఁ జెప్ప నామె తెల్లవోయి—

ఆ. వె. సతికి నొక్కరుండ । పతిగాక యెందును,
బతులు పలువురగుట । కలుఁగఁగలదె?

లోకనాథ ! యిట్టి । లోకవిరుద్ధంపు
నగమునడయ నగున । నగదయొల్ల.

అని యప్పుడే యామె లోకంబువలని భయంబుఁ దెల్పినది. కాని పరమేశ్వరుని వరంబు తిరుగనేరదు. కావున నయ్యది మొఱంగియే యక్కురంగలోచన సాలోచనయై కాలోచితంబుగ ఫాలలోచనుని నయ్యేవురు పతులయందుఁ బ్రత్యేక సంగమంబును దనకుఁ గౌమారంబును బతిశుశ్రూషాసక్తియుఁ గానుభోగేచ్ఛయు సౌభాగ్యంబును బ్రసాదింపుమని కోరినాతఁడట్లయగుఁగాక యని తిరోహితుండయ్యె. ఆప్రకారంబున ద్రౌపది కేవురు పతులుగలిగిరి.

భగవదిచ్ఛ యెటులున్నను సతికిఁ బతులు పెక్కండ్రు గలుగుట లోకవిరుద్ధమనియుఁ గులాచారంబున కనుకూలంబు గాదనియుఁ జెల్పినఁ బూర్వంబునఁ గొన్ని యెడలఁ బడఁతులకీ వడువునఁ బలువురుపతులు గలరని గ్రంథ దృష్టాంతములు గానవచ్చుచున్నవి. తొల్లి గౌతముండయిన జటిలుఁడను ఋషికూఁతు రేడ్వురు ఋషులకుఁ బత్నియైనదనియు, దాక్షాయణి యను మునికన్యక యేకనామంబునఁ బ్రచేతసులనంబరగిన పదుండ్రకు భార్య యయ్యెననియు, నౌశీనరపతి పుత్రిక యగు సుజాత, నితంతుండను రాజర్షికొడుకులు, సాల్వేయ

శూరసేన శ్రుతసేన బిందుసారాతిసారులను వారేవురకు భార్య యైనదనియుఁ గథల వినంబడుచున్నది. ఈ యాధారంబుల మూలంబున ద్రోవదికేవురు పతులుండుట లోకవిరుద్ధంబు గానేరదు. కులాచారానుసరణీయంబునకు దూరంబు గాఁబో వదు.

ఇంకఁ గర్ణునిపై నామెకు మనంబుగలదనుదానికి భారత ప్రమాణంబు లెచ్చోటను గాన్పింపవు. కాని శ్రీకృష్ణపరమా త్ముఁడు మాత్రము 'పాంచాలి నిన్నారవభర్తగా వరియింపఁ గల'దని కర్ణునితోఁ బల్కినాఁడు. ఈ యాధారంబు మూలం బున ద్రౌపదికిఁ గర్ణునిపై మనస్సుగలదని చెప్పుట కెంత మాత్రము వలనుపడదు. ఆమె మనస్సులో నాతనిపైఁ గోరికయే లేకున్న శ్రీకృష్ణుఁడట్లు వలుకుట యసంభవమని యొకవేళఁ దెలిపిన వో, శత్రువుల స్వపక్షమునకుఁ ద్రిప్పుకొన నెంచుసమ యంబున ననేకంబులగు నాసలఁ జూపుచుందురు. అంతమాత్ర మున నయ్యవి యన్నియు నిక్కంబులగునా? అదియేల ?

'అమర గంధర్వ య । క్షాదులందైనను,
బురుషు నన్యునిఁ దృణం । బుగఁదలంతు'

నని యామెయే తెల్పినది. దీని మూలమునఁ గర్ణునిపై నత్తెర ళనయన చిత్తంబు హత్తికొని యున్నదనుట రిత్తయగు

చున్నది. ఇప్పటికిని జనారోపణంబువలని కళంకంబు దొలంగి పోయినది. ఇంకనా పతివ్రతాశిరోమణి గుణశీలంబుల నెఱుంగుట యుక్తము.

## ౩. గుణశీలవిభేదము.

ఒకరి గుణశీలముల విచారించుటకుఁ బూర్వము గుణములన నెయ్యవియో, శీలమన నెయ్యదియో, యొకించుక తెలిసికొనుట ముఖ్యావశ్యకము—

'దయయును సత్యంబు శౌచంబు । ధర్మబుద్ధి,'

అని చతుర్విధంబుల గుణంబులు వచింపంబడుచున్నవి. మొదటిదియగు దయాగుణంబునుండి పరోపకారాహింసా గుణంబులు పుట్టుచున్నవి. తక్కుంగల సత్యశౌచ ధర్మగుణత్రియం బేకరూపంబునఁ బరిగణింపఁబడుచున్నది.

శీలము గుణములను బట్టియే కలుగుచున్నది. కాని గుణకర్మ పరివిభాగపాటవమునఁ బ్రాజ్ఞులు తత్తత్కర్మంబుల ననుసూచకంబుగ నేకవస్తు ప్రధానంబుగఁ జేకొని శీలమున లీన మొనర్చినారు. గుణము స్వాభావికకర్మానుసారి. శీలము గుణకర్మానుకూల వర్తనసంజాతము. గుణము వ్యక్తిప్రవర్తన

ప్రధానము. శీలము తత్ప్రవర్తన సుకృతఫలస్వరూపము. కావునఁ దొలుదొల్త గుణానురూపకవర్తనంబు విచారించి తదనుగుణంబుగ శీలంబు నెఱుంగుట సమంజసము.

### ౪. గుణనిర్ణయము.

౧. దయాగుణంబు సకలమానవులకుఁ దొడుగని యుత్తమతొడవు. అందు నిరుపమానపతిసేవాపరాయణలగు రమణీజనంబులకియ్యది సహజాలంకారము. ఇట్టి యత్యుత్తమ మగు నలంకారంబును దాల్చియే సాధ్వీమతల్లియగు ద్రౌపది వనంబుల మంగళస్వరూపంబునఁ గ్రుమ్మరినది. ఆమె దయా గుణంబీక్రింది యుదాహరణంబువలనఁ దెలియనగు—

ఉ. ద్రోణునితో శిఖింబడక | ద్రోణకుటుంబిని యున్నదింటఁ బ
త్నీగతనూజశోకవివ | శీకృతయై విలపించుచుండఁగ ని
వారిణిఁ దెరల్చి తెచ్చుటకు | దైన్యము నొందుచు నెంతపాపమో
ప్రాణవియుక్తుఁడైనను | పాపము బ్రాహ్మణహింస మానరే.

అని భీమార్జును లశ్వత్థామను జంపనుద్యుక్తులై యున్న సమయంబునఁ బలికిఁ వారలయుద్యమంబును మాన్పినది. ఇద్దానిమూలంబునఁ బాంచాలికిఁగల దయాగుణంబు విస్పష్ట మగుచున్నది. 'ప్రాణవియుక్తుఁడైననతిపాప' మనిపలికి యామె

తనయహింసాగుణంబును బ్రకటించినది. ఆహా! ఏమి యా యమ సహజకృపాతిరేకము? నిత్యము మాతృప్రేమార్ద్రముచే నర్చింపఁబడిన సుకుమారులఁ గుమారుల నకారణంబుగఁ జంపిన యశ్వత్థామపై నెంతటి కనికరము? అంతటి యపకార మొనర్చినను, నాతనిని విడచిపుచ్చినది. 'అక్షీణతనూజశోక వివశీకృతనై విలపించుభంగి, ద్రోణకుటుంబినియుఁ బుత్రునిఁ గోల్పోయిన విలపించుఁ గదా' యని దిగులొందినది. ఆమెను బుత్రశోకమునుండి రక్షింపవలయునను భావము మూలమునఁ బరోపకారగుణంబును సూచించినది. 'ఆత్మవత్సర్వభూతాని' యనెడి న్యాయమును జక్కఁగాఁ బరిగణించినది. మఱియు—

> క. ఉపకారికి నుపకారము, విపరీతము గాదు సేయ। వివరింపంగా
> నపకారికి నుపకారము, నెపమెన్నక సేయువాఁడు। నేర్పరి...

అను నీతివాక్యము కైవడి సుగుణఖనియగు ద్రౌపది తనకపకార మొనర్చిన వానికే యుపకార మొనర్చినది. 'బ్రాహ్మణహింస మానరే'యని పలుకుటవలన నామె నయ వైశారద్యము తన్మూలమున ధర్మబుద్ధియుఁ దెలియ వచ్చు చున్నవి. పుత్రశోకము కడుపు దహించుకొని పోవుచున్నను, బతులు కోపపరీతచిత్తులై యున్నను, దన్నుదానయే యో దార్చుకొని ప్రియుల క్రోధానలంబును నిర్మలమంజుల నయా నుకూల వచనామృతంబునఁ జల్లార్చి, యాతని నాతని

౩. ఇంకనామె శుచియని తెల్పుటకుఁ దజ్జననమే ప్రబల తార్కాణము.

"పూవుపుట్టిన తోడనే । పరిమళించు
సద్గుణంబు జన్మించుటే । సజ్జనులకు."

అను చందంబునఁ గృష్ణ పుట్టుకవలననే శుచియైనది. జగంబున ననలంబుకన్న మించిన శుచియైనవస్తువు వేఱొండు లేదనుట యందఱికిఁ దెలిసిన విషయమే. అట్టి శుచియగు నగ్ని కుండమునఁ గృష్ణపుట్టినది. అట్టియెడ నామెయందు శౌచంబులేదని చెప్పుటెట్లు ? శుచిగల పదార్థంబున శుచిగలదియే పుట్టునుగాని యశుచియగునది పుట్టఁగలదా ? వేమునఁ జానకము జనించునా ? అందుఁ గేవల మయోనిజ. అగణ్యపుణ్య లావణ్య గుణసమన్విత. ఇట్టి యత్యంతారత్నము నందు శౌచంబు లేకుండునా ?

౪. ఇంక ధర్మబుద్ధిఁ గూర్చి విచారింతమా యామె బుద్ధి యెల్లప్పుడు ధర్మమార్గము నంటియే యుండును. ధర్మతత్త్వంబుఁ గొంతకుఁగొంతయేని యెఱింగినఁగాని ధర్మబుద్ధి గలుగ నేరదు. అట్లగుట నామెకుఁ బతులయెడ నడుపవలసిన ధర్మములు, పతివ్రతలకుఁ దెలియవలసిన ధర్మములు, క్షత్రియ కులకాంతలకుఁ గావలసిన రాజధర్మములు, వేయేల ? సర్వ

ధర్మములు, నామెకుఁ దెలియును. కావున ధర్మబుద్ధి యామె యందుఁ గలదు. ధర్మబుద్ధియే లేకున్న దాని బ్రతు కేమై యుండెడిదో తెలియదు. ఇప్పటికిఁ బాంచాలి గుణసమన్విత యని నిర్ణయించితిమి. ఇఁక శీలమును నిరూపింపనగు.

## ౫. శీల నిరూపణము.

శీలనిరూపణము కులకాంతా లక్షణంబులపై నాధారపడియున్నది. కావునఁ గులకాంత యన నెట్టిదో, తల్లక్షణంబు లెయ్యవియో యెఱుంగవలయుఁగదా ? అగుచోఁ గులకాంతయన నెవరు? పుట్టినయిల్లును, మెట్టినయిల్లును బావన మొనరించునదియే కులకాంత. కులకాంతయే గృహలక్ష్మి. ఇట్టి కులకాంతయే పరమపతివ్రతయని జగంబునవన్నె కెక్కును. కావునఁ బతివ్రతాచరిత్ర మెట్టిదోయామె యాచరింపవలసిన ధర్మము లెయ్యవియో విచారింప వలయు. తొలుత పతివ్రత యన నెవరు ?

సీ. ఋతుమతిగాక శు । ద్ధతయుఁ గలిన యింతి
కన్య దత్పరిణయ । కరణమునకు
నొడయలు వినుతల్లి । యును, దండ్రియును దండ్రి
తోఁబుట్టినతఁడు, మా । తులుఁడు సోద
రుండును, యోగ్య వ । రునిఁ జూచి వారిలోఁ,
నెవ్వరైనను బ్రీతి। నిచ్చువారు

పంచయుంతనుండియుఁ । బ్రభువు దానికినట్లు,
గావున నాతండ । దైవమనుచు
గీ॥ నతనిసుతమూఁగి దేవతా । పితృసమర్చ
నములు నతిథిపూజనము స । న్మతిసమాచ
రించుచును బతిహితము వా । టించినదిప్రు
సతి పతివ్రత యిహపర । సౌఖ్యమహిత.

ఇదియే పతివ్రతాచరిత్రము. ద్రౌపది చరిత్ర మిద్దానికి సరియగుచున్నదా ?

## ౧. ద్రౌపది.

కాంపిల్యనగరంబు రాజధానిగాఁ బాంచాలదేశంబును బాలించు ద్రుపదుండను సౌత్రామణియయిన కోకిలాదేవి పత్నిగాఁ బెద్దకాలంబు రాజ్యభోగంబుల ననుభవించియు ననపత్యుండగుటవలనను, ద్రోణునిచేఁ బరాభవింపఁబడుటవలనను, దత్ప్రతీకారంబునకును, దత్కారణునల్లునిఁగా బడయుటకును, సంతానంబు వడయ సంకల్పశుద్ధుఁడయ్యు, సంకల్పసిద్ధినంద నేరమి, యాజుని యాజకత్వంబునఁ బుత్రకామేష్టిసేసి, తత్ఫలంబుగ ధృష్టద్యుమ్నుఁడను కుమారునిఁ గృష్ణయను కుమారికను బొందెను. బాల్యమాదిగ ద్రౌపది తల్లిదండ్రులయాజ్ఞలకు లోనై వారలకానందముఁ గూర్చుచు శుక్లపక్షచంద్రుని

వలె దినదినాభివృద్ధిఁ గాంచుచుండెను. పైనుదహరింపఁబడిన పతివ్రతా చరిత్రకనుగుణంబుగ ద్రౌపదియు, శుద్ధతగల్గిన కన్యయే యైయున్నది. అంతియగాక వివాహ విషయమునఁ దల్లిదండ్రుల యిచ్ఛానుసారంబుగనే వర్తించినది. ఆమె రాజకుమారిక. తల్లిదండ్రులా మత్స్యయంత్రమును నెవ్వఁడు డెగఁగొట్టునో యాతనికే తమ పుత్రికనిత్తుమని చాటించిరి. దీని వలనఁ గాలవశంబున నొక కురూపుఁడేనియు నక్కార్యమును నిర్వర్తించినచో నసమాన సౌందర్యవతియగు ద్రౌపదిఁ జేకొనఁగలఁడుగదా ? అట్టులని యామె వారిమాటను జవదాఁలేదు. పరిణయకర్తలగు తల్లిదండ్రుల యభీష్ట ప్రకారంబుననే వర్తించి తుదకొక్క బ్రాహ్మణవేషధారుని వివాహమాడినది. అది మొదలు 'పతిగడవంగ దైవతము భామల కెందును లే'దని నాథుల భక్తినారాధించినది. తదాది వారలమతమునే యనుసరించినది. వనవాసంబునఁగూడఁ గష్టమని యెంచక—

....బ్రాహ్మణు లతిపుణ్యు
లెనిమిది వేలు స। మిద్ధమతులు

గీ. యతులు పదివేలు వారల। కనుదినంబు
నన్నపానంబు లర్హ స। హాయనగుచు
నొడికముగ నేనకావింతు'......

నని యామెయొనర్చిన దినచర్యఁ దెల్పినది. దేవతాపితృసమర్చనములు నతిథిపూజలుఁ గావించినది. ఎల్లప్పుడు పతులహితమునే పాటించినది. కావున ద్రౌపది పరమపతివ్రత.

## ౨. పతివ్రతాధర్మములు.

ఇప్పటికి ద్రౌపదియందుఁ బతివ్రతాచరిత్రం బొప్పుచున్నదని నిరూపించితిమి. ఇఁక రెండవదియగు బతివ్రతా ధర్మములెవ్వి?

కం॥ ధని, యధనుఁడు, రూపసి, యె
ప్పనివాఁడు, వివేకి, మూఢు । డావుఁ డరోగుం
డనుగతరోగుండనక, య
గన పతిఁ బాటింపవలయు

పతివ్రతయగు పడఁతి ముఖ్యముగా గమనింపవలసినవియు, సమాచరింపవలసినవియు ధర్మములివియే. ఈధర్మములు కృష్ణయెడల గమనింపఁబడినవా? ఆమె యాదిగర్భేశ్వరి. నిర్ధనులగు బ్రాహ్మణ వేషధారులఁ బెండ్లియాడినది. వివాహము గాక పూర్వమే, బ్రాహ్మణ వేషంబుననున్న యర్జునుఁడు ద్రౌపదినిఁ దల్లికడకుఁగొంపోయి భిక్షఁదెచ్చితినని తెలుప 'మీరేవురు నుపయోగింపుఁ'డని యాయమ పలికినది. విధినిర్ణయము, వారల మనోనిశ్చయము, మాతృనానతియు, నొక్క రూప యగుటవలన నామె నేవురుఁ బత్నిఁగాఁ గోరినారు. అత్తరి వారి నివాసమా కుంభకారుని గృహము! ఆసనములా కుశాసనములు! శయ్యలా పూరిశయ్యలు! అన్నమా భిక్షాన్నము! అంతటి హీనస్థితియందుఁ బతులు

న్ననః, నాగర్భ శ్రీమంతురాలగు ద్రౌపది పతుల భక్తితో సేవించినదే కాని యేవగింపలేదు. మఱియు—

కం॥ కడుఁ బనములుఁ గోలలుఁ గ
ప్పడములు వీరలగనంబు । పరికింపఁగ నా
కృ—డిదేశికులని పగపక
మడవక తను మృత్యునిండు । మునమునసుండే.

గతజన్మంబులనేనియుఁ బాంచాలి పతిభక్తిపరాయణ. తనకుఁ బూర్వజన్మంబునఁ గుష్ఠరోగియగు మౌద్గల్యుండు భర్తయైనను నేవగింపలేదు. చింతింపలేదు. దుఃఖింపలేదు. అట్టి కుష్ఠరోగినిఁ బూజించుటయే కాక, యాతని యుచ్ఛిష్ట మిష్టలీలభుజించెడిది. ఇప్పటికిని ద్రౌపది కేవలము పతివ్రతయే యని తేలినది. ఇట్టి పతివ్రతయే కులకాంత. ఇఁకఁ గులకాంతా లక్షణంబులఁ గూర్చి విచారింపవలయు.

## 3. కులకాంతా లక్షణములు.

శ్లో॥ కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ
రూపే చ లక్ష్మీః, క్షమయా ధరిత్రీ
భోజ్యేషు మాతా, శయనే తు రంభా
షాడ్గుణ్యయుక్తా, కులధర్మపత్నీ.

అని యాపస్తంబ సూత్రంబునఁ గులకాంతా లక్షణంబులు వలుకంబడినవి. ఈ లక్షణంబు లన్నియు ద్రౌపది యందు సార్థకంబు లగుచున్నవా?

## 'కార్యేషుదాసీ'

కృత్యంబుల నిర్వర్తించునపుడువిసుగు జనింపఁగూడదు. తారతమ్యంబుల నెంచి గర్వపడఁగూడదు. అన్నిఁటికి లోనుగావలయు. కేవల మొక పరిచారిక వోలె మెలంగవలయు. అప్పుడే 'కార్యేషుదాసీ' యను పదము సార్థకమగును.

ద్రౌపది యతులిత వైభవోపేతులగు పాండవులకుఁ బత్ని. అందుఁ గేవల మామె మహారాణి. ఆమె కాలు క్రిందఁ బెట్టకయ, యన్ని పనులను జేయించి కొనఁగలదు. చేయుటకుఁ బరిచారికా జనంబులు వేనకు వేలు గలరు. కాని యామె యట్టుల నల్పినదా? ధర్మరాజు రాజసూయాధ్వర మొనర్చు నప్పుడు——

......సకల భూములనుండి
వచ్చిన రాజన్యు । లగుల నవని
సురులను వైశ్యుల । శూద్రుల నాత్మీయ
బంధు సుహృద్వీర । భట నియోగి
జనులను బేదల । సాధుల నిత్యంబుఁ
దాన పరీక్షించి । తగ నెఱింగి

యన్నంబు దయఁబెట్టి । యందఱుఁ గుడిచినఁ
దనుమధ్య యర్ధరా । త్రంబు నప్పుడు
గాని భుజింపదెట్టి । కమలాక్షి ద్రౌపది......

దీని వలనఁ బాంచాలి పనుల యందెవ్విధి మెలంగు నదియుఁ దెలియు చున్నది. దాసియేనియు నింతటి కష్టము నకు లోనుగాదు. అర్ధ రాత్రంబునఁ గదా మహారాణియగు నామె పిడికెడు మెతుకులు గుడుచుట? పరిచారికయన నిట్లు గదా యుండ వలసినది? ద్రౌపది తాను రాచబిడ్డ యని గర్వ పడలేదు. పనులన్నియుఁ దానేల చేయవలయునని ముసుగు వెట్టికొని మూలఁ గూర్చుండ లేదు. చేయవలసి వచ్చెఁగదా యని విసిగికొన లేదు. గొణుగుకొన లేదు. కసిరి కొనలేదు. ముం దితరుల విచారించినది. తీరికయగు వేళఁ దన్ను విచారించి కొనినది. అదిగాక తాను మహారాణినని పతులకుఁ బరిచారికల వలనఁ బనులు సేయింప లేదు. పతి శుశ్రూషయే పడఁతులకుఁ బరమ కార్యమని యామెకు బాగుగాఁ దెలియును. కావుననే పతుల కన్నియును దనకుఁ దాన సమకూర్చినది. 'కార్యేషుదాసీ' యని జనులవలనఁ దన్నుఁ గూర్చి పలికించినది.

## 'కరణేషు మంత్రీ'

కులకాంతయగు కాంత, కాంతుఁడు చింతాక్రాంత స్వాంతుండగు నంత దత్కారణం బారసి యాతని మనస్తా పోపశమనంబు సేయవలయు. చేసి యాతనికిఁ బ్రబలోత్సా

హాంబు గలిగింపవలయు. కలిగించి యాతనిఁ గార్యసుముఖునిం జేయవలయు. ఇక్కరణి నల్పుటకుఁ గాంత వివేకవతియై యుండవలయు. ఎయ్యదియేని రాచ కార్యంబులఁ గూర్చిన సంతాపంబు కాంతునకుఁ జేకూరినఁ దన్నివారణంబు, తత్ జ్ఞానంబు వలననే సేయనగును. ఈ యర్థము ద్రౌపది యందు నిరర్థకమా ? లేక సార్థకమా ?

అజ్ఞాత వాసానంతరము పాండవులు సంధి కియ్యకొనని కౌరవులతోఁ గురుక్షేత్రంబునఁబదునెనిమిది దివసంబులుదారుణ రణం బొనర్చి విజయలక్ష్మియుఁ దన్మూలమున రాజ్య లక్ష్మియుఁ గైకొనిరి. కాని సంగ్రామానంతరంబున ధర్మజునకు బంధువధ నిమిత్తంబుగఁ జిత్తంబుమారి మన స్తాపం బినుమడించినది. తొంటి యుత్సాహము నశించినది. రాజ్య విభవంబులపై నాస యంతరించినది. అరణ్యంబులఁ గందమూల ఫలాశనంబున నివసింప నిచ్ఛ జనించినది. ఇంత దనుక నొనర్చిన కృషియంతయు నిష్ప్రయోజనమగు స్థితి సంభవించినది. అట్టియెడఁ బవన తనయ ధనంజయ నకుల సహదేవు లెంతయో పట్టుబట్టి యాతని మనంబుఁ ద్రిప్పఁ జూచిరి. కాని లాభములేక పోయెను.

ఆ సమయంబున ధర్మాధర్మ నిదర్శన శీలయగు పాంచాలి మున్నతని వలన, ననవరతోపలాలిత యగుట

వలని చనువు బలిమిని, యమ తనయుఁ జేరంజని, మున్నాన రించిన వనవాసంబున నాతని తమ్ములు నల్వు రాయాస ములఁ బడుట యవలోకించి——

సమయకాలము సన్నఁ । జని సుయోధనుఁ జంపి
భోగంబులను బహుఁ । త్యాగములను
యాగంబులను సన్వి। హితముల్ సలుపుదె?

మని తమ్ముల నాతఁ డూరడింప లేదా యనియు, ధర్మ మార్గం బాతని కన్న నెఱింగినవార లెవరనియు ననేక విధంబుల మృదువచనంబుల నెఱింగి యెఱుంగని గతి మందలించుచుఁ దుదకు——

కం. గిరముని, గృహదాహక, మం
త్రి రహస్య విభేద, వధ విధాయిఁ, బరస్త్రీ
హరు, బంధు ఘాతుఁ, బరధన
హారణ పరునిఁ జంపి పుణ్యుఁడగు నృపుఁ డనఘా?

మఱియు——

కం. దండార్హులైనవారల
దండింపక యున్నఁ జూన్న । శ్రీవిభు నా
ఖండల సన్నిభుఁడైనఁ బ్రచండప్రఁగిల్బిషము పొందు । [illegible] !

అని రాజునకుం గల పాప పుణ్యముల నెఱింగించినది. జగతీ ధవులయందు విధి, దండనీతిఁ బ్రతిష్ఠించెను. కాన నపరాధుల గుణంబుల నెఱింగి, తదనుగుణంబుగ దండించు నృపున కిహపరంబులు రెండును గరతలామలకంబు లగునని చెప్పినది. అంత నిలువక—

శ్లో. వ్రజంతి తే మూఢధియః పరాభవమ్
భవంతి మాయావిషు యే న మాయినః
ప్రవిశ్యహిఘ్నంతి శఠాస్తథావిధా
న సంవృతాఙ్గాన్నిశితా ఇవేషవః.

అని పలికి కపటులఁ గపటంబున జయించుటయే రాజ ధర్మమనియు, దుర్యోధనాదులు గపటంబునఁ దమ రాజ్యంబు సర్వంబు నపహరించిన వారలు గావున నట్టివారలఁ గపటంబున జయించుట పాపంబుగాదనియుఁ, గురు వృద్ధులగు భీష్మాదులఁ గపట యుద్ధంబున జయించితినను ధర్మచింత ధర్మరాజునకు వలదనియు, దాని మూలమునఁ బాప మేమాత్రము లేదనియు నెన్నియో తెఱంగుల ధర్మజునకు ధర్మ సూక్ష్మతను జెప్పి కొంతవర కాతని మనస్తాపశమనం బొనర్చినది. అయ్యది యెఱింగి—

శ్లో. గుణానురక్తా మనురక్తసాధనం
కులాభిమానం కులజాం నరాధిపః

పరైస్త్వదన్యః క ఇవాపహారయే
న్మనోరమా మాత్మవధూ మివ శ్రియమ్॥

అని రాజ్యలక్ష్మిని, కులకాంతకుఁ బోల్చి, సుగుణంబుల వలన సతి పతి కెవ్విధి ననురక్తయగుచున్నదో యవ్విధి రాజ్యలక్ష్మియుఁ బ్రజానురంజక గుణంబుల వలనఁ బతికను రక్త యగుననియు, నట్టి రాజ్యరమను నొల్లకుండుట కుల కాంతను ద్యజించుటయే యనియుఁ, దెల్పి ధర్మజుని ధర్మ బద్ధునిఁ జేసినది. నవినయోపాధ్యాయుని మాడ్కి సంపూర్ణ ముగా మండ లించినది. తాను మున్నువడిన బన్నములను నొక్కొ వక్కాణించి యంతవఱ కెక్కడనో నక్కియుండిన నిక్కమగు క్షత్రియ పౌరుషంబును, ధర్మజుని మనో దర్పణ మున నొక్కమారు ప్రతిబింబింపఁ జేసినది. 'కరణేషు మంత్రీ' యని తన్ననునట్లు మెలంగినది.

'రూపేచ లక్ష్మీ'

గుణముల వలనఁ గాంత కులకాంత యగుచున్నది. ఆ కులకాంత గృహలక్ష్మి యగుచున్నది. అట్టి కాంత గుణ వతియు సౌందర్యవతియు నగుచో నిఁకఁ జెప్పనేల? ద్రౌపది గుణముల వలన గృహలక్ష్మి స్వరూపమును దాల్చియున్నది. కాని సహజముగ లక్ష్మీ స్వరూపయేనా?

సీ. తన కెంపు నధరప । త్త్రాకతలంబులఁదాల్చి
శ్రీమించఁబుట్టు రా । జీవపాణి
దన నల్పు కచవిలో । కనరోమరాజులఁ
బూని యార్యత్రగాలఁ । బొడముగౌరి
దన తెల్పు నఖర దం । తములఁజేర్చికలాప
తీక్ష్ణ మొప్పజనించు । దివ్యరాణి
దన స్వస్వలత్వంబు । స్తనకటులధరించి
యానన్వె మెసఁగ నో । దవు వసుమతి

గావలయునని యామె సౌందర్యము పుట్టుకతోడనే వర్ణింపఁబడియున్నది. అంతియగాక——

శ్లో. పాంచాల్యాః పద్మపత్రాక్ష్యాః
స్నాయన్త్యా జఘనం ఘనమ్
యాః స్త్రియో దృష్టవత్యస్తాః
పుంభావం మనసా యయుః॥

అని ద్రవిడ పురాణంబులఁ గొన్నిమెడలఁ దెలుపంబడుచున్నది. దీని మూలమున ద్రౌపది రూపమెట్టిదో చక్కగాఁ దెలియుచున్నది. ద్వాపరమున ద్రౌపది యందఱికన్న సౌందర్యవతియని ద్రవిడపురాణంబులు దెలుపుచున్నవి. కావునఁ బాంచాలి సహజముగ లక్ష్మీ స్వరూపయే.

"క్షమయా ధరిత్రీ"

క్షమా గుణ శక్తి పతివ్రతలయందు ధరిత్రీదేవి యందువోలె మూర్తీభవించి యుండవలయు. లేకున్న

లోకంబులన్నియు వారల శాపానలంబునకు భస్మంబులయి పోక నిలువఁగలవా? ఈ క్షమాగుణ విభవంబును గొంద ఱెఱుంగనేరక—

కం॥ క్షమియించువారిఁగని చా
లమిపెట్టుదు రైననుం ద । లంపననూన
క్షమయ కడుమెఱయు తోడ వృ
త్తమరూపముగోరువారు । దాల్తురు దానిన్ ॥

అని క్షమాగుణ ప్రభావంబు దెలుపఁబడినది. ఇట్టి గుణాలంకారమును బతివ్రతామతల్లు లగువార లందఱును దాల్తురు. ఈ యలంకారము ద్రౌపదికిఁ గలదా?

ద్రౌపది పుట్టినయిల్లు వాసిన నాఁటనుండియు, నే కొన్ని నాళ్ళు సుఖములఁ బడసినదో కాని, యెక్కువకాలము వనవాసాయాస క్లేశంబులకును, మానభంగములకును లోనై యెన్నియో కష్టములఁ గుడిచినది. అన్నిఁటిని నోర్పువహించి భరించి యుండినదే కాని తన కిన్ని కష్టంబులఁ గూర్చినారని యొక్కనాఁడేనియుఁ బతులఁబల్లెత్తు మాటయని యెఱుంగదు. 'క్షమయాధరిత్రీ' యను వాక్య మీమెయందు సార్థకంబగుటకుఁ దత్పుత్రవధయే ప్రబలప్రమాణము. పవనతనయు గదా ఘాతంబునఁ దొడలు విరిగి పడియుండిన కురుకుల నాథునకుఁ

గరంబు ప్రియంబు సేయందలంచి, యశ్వత్థామ యుద్ధానంత రంబున నిర్భయంబుగ శిబిరమ్మునం జేయిడి నిదుర వోవుచున్న పాంచాలి కుమారులం, గేవలము పిన్న వయస్కుల, ననుర కృత్యంబనక సంహరించినాఁడు. విజయలక్ష్మీ సమన్వితులగు నాథు లింక రాజ్యలక్ష్మీ ధురంధరు లగుదురనియుఁ, బుత్రుల ముద్దుముచ్చటల కానందించుచు సుఖంబుల ననుభవింప వచ్చుననియుఁ,దలంచియుండిన పాంచాలి కిది హృద్ఘాతమైనది. అవ్వార్త వినిన తోడనే స్పృహదప్పి నేలఁబడిపోయినది. తెలి వొంది యెంతయో విలపించినది. తుదకు దుఃఖంబు మిక్కుటంబగుడు నక్కటికంబు వోద్రోచి యక్కమలాయతాక్షి ధర్మ తనూజుఁగాంచి శిశుహంతకుండగు నా గురుతనూజుఁ జంపకయున్న—

ప్రాయోపవేశమున ని
కాయ ముపేక్షింతుఁజుమ్మ। కౌరవనాథా!

అని యతి పరుషముగాఁ బలికినది. ఆ క్షణంబ భీమార్జును లరిగి యాతని బట్టుఁజేసి యామె ముందరకుఁగొని తెచ్చిరి. అది యేమి మాయయోకాని యాతనిఁ జూడఁగనే యామయ క్రోధానలంబు నైజ కృపామృతంబునఁ జల్లార్పఁ బడినది. క్షమాగుణ భూషణంబామె కంఠసీమ నలంకరించి

నది. కోపము చల్లారినది. పరితాపము నశించినది. ఆమె చిత్తంబంతయు క్షమాయత్తమై పోయినది. ఆతనిఁ జంపినంత మాత్రమునఁ దనపుత్రులు బ్రతుకఁబోదురా యనియో తలంచినదో, పుత్ర మరణానంతరమున ద్రోణ కుటుంబినియుఁ దనకువోలె సుతునికై శోకించును గదా యని జాలియేపడినదో—

'.......చంపఁ దగినఁ కర్మంబుఁ జేసినఁ
జంపఁదగము విప్రఁజాతి.........'

అనియెడి ధర్మమునే పాటించినదో, కాని యామె యేమాత్ర మాతనిఁ జంప నంగీకరింప లేదు. అయినను బుత్ర శోకానలంబు కడుపు దహించుకొని పోవుచుండ—

క. భూసురుఁడవు బుద్ధిదయా
భాసురుఁడవు శుద్ధవీర। భటసందోహా
గ్రేసరుఁడవు శిశుమారణ
మాసురకృత్యంబు ధర్మ। మగునే తండ్రీ!

అని యెంతయో వినయముగ మందలించినది. ఇట్టి దారుణ కార్యంబు సల్పుటెన్నండును దగవుగాదని బుద్ధి సెప్పినది. కాని—

అపచారములు సైప। నగువాఁడు విప్రుండు
గాని రాజన్యుడు। గాడు తెలఁప

అను వచనానుసరణిఁ దాను సుక్షత్రియ కులసంజాత యగుట, నపచారములఁ దాను సైచుట కులధర్మ విరుద్ధంబు గాన, బ్రాహ్మణ హింస ఘోరపాపంబుగాన, 'ఏకక్రియా ద్వ్యర్థకరీబభూవ' అను చందంబున నాతనితో —

శా. ఉద్రేకంబున రారు శస్త్రధరులై । యుద్ధావనిన్ లేరు కిం
చిద్ద్రోహంబును జేయఁ బోవరు, బలో । త్సేకంబుతోఁ జీకటిన్
భద్రాకారులఁ బిన్న పాపల, రణ । ప్రౌఢక్రియా హీనులన్
నిద్రాసక్తుల సంహరింప నకటా । నీ చేతు లెట్లాడెనో.

అని మాటాడి యాతని చిత్తంబును సంపూర్ణముగ నొప్పించినది. కత్తివలనఁ బ్రాణములఁ దీయ లేదనియే కాని మాటల వలనఁ బ్రాణముల నిక్కముగ సంహరించినది. తన రాజత్వమును రక్షించు కొనినది. అపచారమును సైఁపక యాతని నొప్పించినది. తుద కాతని శిరోమణిని గ్రహించి తృప్తి సెందినది.

## 'భోజ్యేషు మాతా'

పతిభక్తి యుతయగు సతి, తన పతిని జనని విధమునఁ గనుల నిడికొని పోషింపవలయు. సుతుల బ్రతుకుపైఁ దల్లి కెంతటి యారాటముండునో, సతికిని పతిబ్రతుకుపై నంతటి యారాట ముండవలయును. భోజనాదికములఁ దల్లిని మఱ

పింప వలయు. ఈ గుణము ద్రౌపది యెడల సార్థక మగుచున్నది.

తే. గీ. స్నాన భోజన శయనాది సంప్రయోగ
మర్థిఁ బతులకు మున్నుగా నాచరింప

అని యామెయే తన గుణమును ప్రకటించుచున్నది. దీనివలనఁ దల్లి యేరీతిగ ముందు సుతులకుఁ బెట్టికాని తరువాతఁ దాను గుడువదో, యదేరీతిగ ద్రౌపదియు నాహారాదికములయందు భర్తలయెడ వర్తించుచున్నదని తేలుచున్నది. అదిగాక కుంతీదేవికిఁ బాంచాలి గుణ మెట్టిదని మొనదియు బాగుగాఁ దెలియును. అందువలన నే వనవాసంబునకై పతుల వెంటనంటిచనుచున్న ద్రౌపదిఁ గుంతి చేరఁబిలిచి, పిన్నవాఁడగు సహదేవు నామె కప్పగించుచు సుకుమారుఁడగు నాతఁడు తనకుఁగల యాఁకటిప్రొద్దుఁ దా నెఱుఁగఁడనియు, నాతని మనంబెఱింగి తానే యాతనిఁ గుడువఁ బిలుచుమనియు, నట్టివాఁడు గానల కేగుచుండుటవలన——

......మనము గుంటెడు నీఁగని యూరడిల్లెదుగా.

అని పలికినది. 'నీఁగని యూరడిల్లెదుగా' అని కుంతి వలుకుటవలన, ద్రౌపది తన మగలను గుంతికింబలె పోషించునని తెలియుచున్నది. లేకున్న నామె హితసంతాపకా నేరదు.

ఇవి యన్నియు నేల? కృష్ణ యెప్పుడు పతిపూజానక్త చిత్త యైనదో, యప్పుడే యామె యందుఁ గులకాంతా లక్షణంబులు నాట్యము లాడుచున్నవి.

'శయనేషు రంభా'

ఈ యర్థము కథా సందర్భమునఁ యథార్థముగఁ దెలుపుట యసందర్భము గావున వివరించి వ్రాయుట యయుక్తము. గ్రంథంబుల నేనియు సిద్ధానిఁ గూర్చి వివరింపఁబడ లేదు. ఇన్ని గుణములున్న కాంత కియ్యది మాత్రము లేకుండునా ?

ఇప్పటికి ద్రౌపది పతివ్రత యనియుఁ, గుల కాంతా లక్షణంబు లీమె యందుఁ గలవనియుఁ, దెలిసి కొంటిమి. శీలమును గూర్చి కొంతవఱకు విచారించితిమి. కాని పతివ్రత యగు సతి, తన్నుఁదా నుద్ధరించుకొని లోకము నుద్ధరింపవలయు. తన్నుఁదా నుద్ధరించు కొనుటకు సతికిఁ బతి సేవయే ప్రధానము. ద్రౌపది తన్నుఁదా నుద్ధరించు కొనినది. జగమును నుద్ధరించినదా? మహాత్ములగు ఋషులు ద్రౌపదీ నామ సంకీర్తనంబు సకలదురిత హారంబని వాక్రుచ్చి యుండుట మన మెఱింగియే యుంటిమి. జగ దుద్ధారణ గుణంబులే కృష్ణ యెడల లేకున్న మును లీవిధి నామెను గూర్చి పలుకఁ జాలరు.

ముందు జగదుద్ధారణ మన నేమి? సకల కార్యముల కాదర్శక ప్రాయుఁడగు వాఁడెవఁడో, యాతఁడే జగ దుద్ధారకుఁడు. అట్టి వాని ప్రవర్తనమే జగ దుద్ధారణము. ద్రోవది యెడల నియ్యది చెల్లుచున్నదా? ఋషుల వాక్యము లిందు సార్థకములేనా?

## ౬. ఋషులవాక్యములు సార్థకములు.

### ౧. ద్రౌపది యొక్క పరిచారిక.

ఎప్పుడు పుట్టినిలువాసి మెట్టినయిలు సేరునో యప్పుడే యాయువతి రాజాధిరాజ పుత్రికయే యగుఁగాక, యతులిత భోగంబులఁ బుట్టినయింట ననుభవించినదే యగుఁగాక, యత్తవారియింటఁ బరిచారికయే. కారణమేమనఁ బరిచారిక యేరీతి గృహమునఁ గలవారల కనుకూలముగ నుండవలయునో యారీతిగనే యత్తయింటి కోడలును, నత్తమామల కనుకూలముగను, నాడబిడ్డలకుఁ దలలోని నాల్కఁగను, బావమఱఁదులపట్ల భయమునను, నెచ్చెలులతో మాడ్కి సపత్నులయెడ నెయ్యమునను, బతిచెంత సవినయ విధేయత తోడను, నాదిగాఁగల గుణంబులఁ గలిగి వర్తింపవలయు. అప్పుడే యది కులకాంత యగును. ద్రౌపదిగూడ నత్తయింటి కోడలే. అగుచో నీగుణంబులన్నియు నామెయందు

గలవా? ఆమెకా యాడబిడ్డలులేరు. మామయా గతించి నాఁడు. సపత్నులా చెంతనుండరు. బావలైనను, మఱఁదులైనను, భర్తలైనను, బాండవు లేవు రే. ఇఁక నీమె పాలింప వలసిన గుణంబు లత్తకనుకూలముగను, పతులకనురక్తము గను, నుండుటయే. తనకు సపత్నులు గలరని యామె యెక్క నాఁడేని వారలపై మత్సరభావమును జూపలేదు. పతులపైఁ గినియలేదు.

పతులాత్మనొండొక్క । పడఁతులఁగలసిన
నలుగ నెయ్యేడల న । హంకరింప

అని యామెయే తన గుణమును దెల్పుచున్నది. దీని వలన సపత్నులయెడ నామె నెచ్చెలులతోబలె వర్తించినదే యని తెలియుచున్నది. ఇఁక భర్తలయెడనో చూపవలసిన వినయవిధేయతలను జూపినది. పతుల మెప్పించినది. తాను వారలవలన మెప్పువడసినది.

సీ. ఒక్కొక్కనికంటె । నువిదనీకేవురు
నను రక్తులగుట య । త్యద్భుతంబు
నగు మొగంబులకాని । నలినాక్షి నెపుఁడుఁ
బతులకుఁ గింకిరి । పాటులేదు.

అని తన పత్యనురక్తతను గూర్చి సత్యవలనఁ బలికించినది. ఇఁక న్యాయ్యమైయుండుఁ జూడవలసినది యత్తకనుకూలముగ వర్తించుటయే. ఇదియును నామె యెడలఁ గలదు.

ఉ. 'అత్తను భక్తిగల్గి మది। నాయమ సెప్పినమాడ్కి జీవికా
వృత్తము లావహింతు'.

అని యామెయే తెల్పుచున్నది. నిశ్చయముగ నత్తమోఁగిల నామె యొక పరిచారికయే. అంతియగాక, పరిచారిక యే విధమునఁ దన యజమానురాలి కన్నివిషయములఁ బరిచర్య యొనర్చునో యావిధముగనే—

'సతతంబు భోజన। స్నానాదికముల యం
దిమ్ముగఁ బరిచర్య। యేన చేసి
సంప్రీతఁ జేయుదు'...............

అని పలికి యామె తన పరిచారికాధర్మమును వెల్లడి చేసినది. తానత్తకనుకూలముగ వర్తించునని స్పష్టముగఁ బ్రకటించినది. నాథుల కనురక్తయై యేవిధమున మెప్పువడసినదో, యావిధముననే యత్తవలనను—

చ. కొడుకుల కంటె నయ్యనుఁగు। గోడలి కెక్కుడుఁగూర్తుఁ గోడలుఁ
గొడుకులు సేయుభక్తి కట। కోటి మడుంగులు భక్తినాకు నె
ప్పుడుఁదగఁజేయుచుండు నది। పుణ్యచరిత్రి కులాగ్రగణ్య......

అని మెప్పువడసినది. గుణంబుల నన్నిఁటిని బాలించినది. తానత్తయింట నొక పరిచారికయే యని నిరూపించినది. లోకమునఁగల యువతీమణులంద ఱిక్కరణి మెట్టినయిండ్ల మెలఁగవలయునని తానాదర్శకిన్నై తెలియఁజేసినది.

## ౨. ద్రౌపది నిక్కమగు గృహిణి.

గృహిణియన గృహభారంబు సర్వంబు మోయునదియే. అవిలే వివిలేవని నాథుని మనంబు గలంపక యున్నయంత పట్టుననే తృప్తివడుచుం గొఱంతయున్న బయలునకు రానీక గుట్టుచక్కముగం గుటుంబమును జరుపుకొని పోవునదియే గృహిణి. మగఁడు తెచ్చిన దానిని వ్యయావ్యయంబుల గుఱించి వాడుకొనునదియే గృహిణి. ఈయర్థము ద్రౌపది యందు సార్థక మగుచున్నది. ఆమె గృహిణియైన నాటం గోలె గృహకృత్యంబుల నన్నింటిని నామెయే విచారించు చుండెడిది——

> వ. 'పరమయశోధనులగు పాండునందనులు నిజకుటుంబ భారంబు
> సర్వంబు నాయందు సమర్పించి తాము నిర్భరులై యిష్టవిహారం
> బుల నుండుదు రేనెల్లవేళల నప్రమత్తనై వర్తింతు.'

అని ద్రౌపది తాను గృహంబున మెలంగు తెఱంగు జెప్పినది. గృహభారంబు సర్వంబును నిజభుజస్కంధంబున మోయుచు భర్తలకు స్వేచ్ఛావిహార మొసంగినది. ఆమె రాణియైనను, ధర్మజుని నగరునంగల సర్వవస్తువాహనాదికంబుల స్వయముగాఁ బరీక్షించుచుండెడిది. అటు గురువిప్రజనాతిథిపూజనంబుల సత్యోత్తమభక్తి సేయుచుండెడిది.

ఇట్లు దాసదాసీజనంబుల దయతో మనుపుచుండెడిది. ఇటు లన్నింటిని దనకుఁ దానయే చక్కఁబెట్టుకొనుచుండెడిది. ఒక నాఁడు దన్నుఁ గూర్చి——

ఆ. వె. వేగ జాము గలుగ । మేను నిద్రఁ బోదుఁ
గాని రాజ్యభార । కార్యయుక్తి
నబ్జనయన నాకు । నాహార నిద్రల
కెడయు లేదు సువ్వె । యెల్ల ప్రొద్దు.

అని సత్యకుఁ జెప్పినది. అట్లుఁ దాను బ్రవర్తించి లోకం బున గృహిణులగువారలిట్లు మెలఁగవలయునని సూచించినది.

### 3. ద్రౌపది సేవాధర్మజ్ఞ.

పతుల మతమునే పాటించి వనవాసానంతరంబున జరుపు నజ్ఞాతవాసంబున నామెయుఁ గేవల మొక దాసివలె సుదేష్ణను గొలిచినది. ఒకరిచేఁ బని చేయించుకొనవలసిన పాంచాలి యొకరికిఁ బనిచేయవలసివచ్చినది. ఆహా! కాల మహిమ యెట్టిది! అట్లామె పరిచారికావృత్తి నవలంబించి నప్పటినుండియు——

సీ. సన్నదనంబుగా నలుఁగు । నూరిచియుఁ జావనపట్టు రాచియుం
జిన్నగఁ గ్రొత్తలైన కల । పంబులఁ గూర్చుచు......

నా సుదేష్ణకుఁ గనుసన్నల మెలంగుచుండ, నాయీ పనుల నెన్నఁ డొనర్చినదికాదు గావున పాపము! పుట్టినప్పటినుం డియు సుకుమారముగఁ బెరిగినది కావున, నెండ కన్నెఱుం గని యింతిగావున, స్నిగ్ధములును, మృదులములును, నగు నామె పాణితలంబులు కిణస్తోమంబుల మొరటువారినవి. పరి చారికాతనంబున నావిధంబుగఁ గష్టపడిన దేకాని యొక్కనాఁ డేనియు నోడలు దాఁచుకొని యుండలేదు. కాని యింతమా త్రముననే యీమె సేవాధర్మజ్ఞ యని పలుక వలనుపడదు.

దురాత్ముఁడగు కీచకుఁడు పాంచాలిని సామాన్యవనిత యని తలంచి మదనోద్రేకంబున నెన్నియో దుర్భాషల నాడినాఁడు. ఎట్టులనో యీ యధముని బారినుండి ద్రౌపదీ మహాదేవి తప్పించుకొనినది. కాని సేవాధర్మమునుండి తప్పించుకొనుటెట్లు? సుదేష్ణ తాను జేయఁబోవు కార్య మనుచితమని యెంతయు శంకించియుఁ దమ్మునిపైఁగల ప్రేమాతిశయమువలన ద్రౌపదిని జేరంబిలిచి తనకుఁ జిత్తమస్వ స్థతగా నున్నదనియు, నయ్యది రుచిగల మదిరారసంబుఁ గ్రోలినఁ బోవుననియు, నట్టిది కీచకుని యింటఁ గలదనియుఁ గపటవచన ప్రకారంబునఁ దెల్పి యీమె నద్దానిఁ గీచకుని యింటికరిగి కొనిరావలసినదని యాజ్ఞాపించెను. సుదేష్ణయా మహారాణి! ద్రౌపదియా యీమె పరిచారిక! పరిచారిక యజ

మానురాలి కనుగుణంబుగ మెలంగవలయు. పాపము! ఆ యాదేశంబు నాలకించినతోడనే, యామె యుల్లంబు తల్లడిల్లి పోయినది. శరీరంబునఁ గంపం బుదయించినది. కాని యేమి చేయఁగలదు? 'పోవుటయా, మానుటయా' యను ప్రశ్నలు జనించినవి. పోయిన మృత్యుగహ్వరంబుఁ జొచ్చుటయగును. మానిన సేవాధర్మము మంట గలియును. అట్టి సమయంబు నందేనియు నాయమ చలింపని హృదయముతో సుదేష్ణను జూచి—

ఓ, వనయముఁ గోరినట్టి పని యుత్తమమైయుండ జని చేయుదానఁ గాక?

అని పలికినది. తత్ప్రకారంబునఁ దన పాతివ్రత్యమహిమాయుధ ధారిణియై యాతని యింటికిఁ జనినది. మృత్యుగహ్వరంబు సొచ్చినది. యజమానురాలియాజ్ఞఁ బాలించినది. సేవాధర్మము నెఱవేర్చినది. ఇట్టి దానిని సేవాధర్మజ్ఞ యని పలుకవచ్చును. ఇందును సేవకులగువారలు దమకుఁ గష్టములు సంభవించు కాలముననేనియు సేవాధర్మమును బాలింపవలయునని లోకమునకు విన్నవించినది.

౪. ద్రౌపది పతివ్రతా ధర్మజ్ఞ.

ఇదివఱకు ద్రౌపది పతివ్రతయని నిరూపింపఁబడినది. పతివ్రతయగునది తన్నుఁదా నుద్ధరించుకొనవలయును. తనమాల

మున నితరుల నుద్ధరింపవలయును. ఇయ్యది పాంచాలియందుం గలదా? ఆమె పతివ్రతాధర్మజ్ఞ యేనా?

సౌందర్యగర్వపట్టమహిషియగు సత్యభామ యొక్కనాఁ డేకాంతంబునఁ బాంచాలిఁ జేరంజని, పరమ పతివ్రతామతల్లియగు నామె పవిత్రచరిత్రంబు గురుతింపనేరక తత్పత్యనురక్తతనుగూర్చి—

తే. గీ. ‘వ్రతము పెంపొ మంత్రౌషధ । వైభవంబొ
సరస నైపథ్య కర్మకౌ । శలమొ చతుర
విభ్రమోల్లాస రేఖయొ । వెలఁది నీ వి
శేష సౌభాగ్య హేతువు । సెప్పుము నాకు.’

అని యడిగినది. తన్నట్లు దుష్టవనిత యడిగిన వడువున నడిగినదని యామెకుఁ గోపము వచ్చినది. కాని కోపము నడంచుకొని సత్య వివేకహీనయని యెంచి మేలంపుఁ జంగిమున నామెతోడ—

చ. అలయక మంత్రతంత్ర విధు । లౌషధభంగులఁ జేసి యెంతయున్
వలతురు నాథులంట మగు । వా! కడు బేలతనంబు దాన మన్
గలిగిన ప్రేమయుం బోలియుఁ । గాని యొకండును సిద్ధిబొంద ద
ప్పొలఁతుకతోడి మన్కియహి । పొత్తుగఁ జూచు విభుం డెఱింగినన్.

చ. మగువ యొనర్చు వశ్యవిధి । మందులు మాయలు నొందుచండమై
మగనికిఁ దెచ్చు రోగములు । మానక మూకజడాదిభావముల్

మొగినొనరించు నద్దురిత । ముల్ దనచేసిన చేతలై తుదిన్
జగమున కెక్కు నిందయును । సద్గతిహానియు వచ్చునింతికిన్

అనిసవినయంబుగ నామెకు బుద్ధిసెప్పినది. మందులుమాయల వలన భర్తలను వశపఱచుకొనవచ్చునని తలంచు వనితల కందుఁగల యవగుణంబుల స్పష్టముగఁ దెల్పినది. సత్యయొక్క యభిప్రాయమును దొలంగించినది. పత్యనురక్తతను సంపాదించుకొనుటకు వనితలకుఁబతిభక్తియే మూలమని వక్కాణించినది. అంతటను నూరుకొనక, పతివ్రతయగు సతికి—

కం. తలవాఁకిటఁ బలుమాఱో
నిలుచన్ బెరవారికెలన। నిగిడింపదు జూ
ప్రులఁ గతము లేనినవ్వున,
మలఁగన్.........

జనదని ధర్మము నెఱింగించినది. మఱియు భామలకుఁ బతియే దైవమనియుఁ బతి సంతుష్టుఁడైన, సతి కఖిలకామములు దీరుననియు, సంతతి గలుగుననియు, వివిధభోగము లబ్బుననియు, శాశ్వతంబగు కీర్తియు సంభవించుననియు, స్వర్గంబుఁ బొందనగు ననియు, మొదలగు ధర్మంబుల నెఱింగించి తన పతివ్రతా ధర్మజ్ఞత్వమును లోకమునకు వెల్లడిచేసినది. సత్యకుఁ గలరూపు గోచరింపఁజేసినది. లోకమునఁ

ద్రౌపది గుణ శీలములు.



పడఁతులందఱుఁ బతిసేవా పరాయణ కుతూహల మానసలై, పతుల సంతుష్టులుగా నొనర్చి తన్మూలమున సౌఖ్యములఁ బడయుట యొప్పునని చక్కఁగా నిరూపించినది.

## ౫. ద్రౌపది సుక్షత్రియ కాంత.

అన్నిఁటి కంటెను ద్రౌపదియందు సుక్షత్రియ పౌరుష తేజోవిజృంభణ మెక్కుడగపడుచున్నది. పుట్టుకవలననే యామె క్షత్రియకాంత. క్షత్రియులు స్త్రీ పురుషవిభేద మను నదిలేక యందఱును సహజముగఁ బౌరుష ప్రధానులే. అందీమె వీరసింహులగు పాండవులకుఁ బత్ని. మానధనులు ప్రాణముల సరకుసేయరు. దుష్పథ గామియగు కీచకుఁ డామె నవమానించినాఁడు. తత్పరాభవానలంబున నామె చిత్తము దహింపఁబడి పోవుచున్నది. తత్ప్రతీకారనిర్వహణంబునకై వాయుజునిఁ బ్రోత్సహించినది. ప్రోత్సహించుటయే గాక—

తే. గీ. వానిఁ జెఁగఁజూడవైతేని । వాయుపుత్ర
నీవు గనుఁగొన నురిసైన । నీరనైన
నగ్నినైన విషంబున । నైన నేను
మేనుదొఱఁగుదు నెట్టు నీ । యానసుమ్ము.

అని తన నిశ్చితాభిప్రాయమును సూచించినది. తన సహజ క్షత్రియత్వమును బ్రకటించినది. సుక్షత్రియకాంత యని

నిరూపించుట కిదియొక ప్రబలకారణంబుగాదు. పాండవులు శ్రీకృష్ణపరమాత్మునిఁ దమకును, గౌరవులకును సంధి సేయు నిమిత్తంబు హస్తినాపురంబున కనుపునపుడు, తమ యేవుర కేనూళ్ళిచ్చినఁ జాలుననియుఁ బంధువధ యిరుదెగలవారికిని బాపంబనియు, వారలకుఁ దెల్పుమని యాతనికిఁ దెలియఁజెప్పి యుద్ధమును దలపెట్టకుండిరి. కాని ద్రౌపదిమాత్ర మద్దాని కియ్యకొనలేదు. నాఁడు నిండుసభను దనకుజరిగిన పరాభవానలంబును, వారల రుధిరామృతంబునఁ జల్లార్పుకొన నెంచి యున్నది. అట్లు పాండవులు సెప్పిన ప్రకారంబు సంధి సేయ నరుగుచున్న శ్రీకృష్ణునిఁ జూచి, దీనవదనంబునఁ దాను మున్ను వడిన భంగపాట్లుసెప్పినది. తన యౌన్నత్యమును బేర్కొనినది. అట్టి ద్రౌపది కిట్టి దుస్థితియా? యని వెచ్చనూర్చినది. అంతకంతకు ఖలులగు కౌరవులు దనకొనర్చిన యపకారంబులకుఁ గ్రోధంబినుమడింప, భర్తలు సంధికై యున్నవారలను వార్త వీనులసోక——

“ఉ. షండతిలోపముల్ పతులు । శౌర్యము ధైర్యము వెచ్చపెట్టి వీ
రొండొనరింప లేక పర । మోత్సుకతన్ ధృతరాష్ట్రుఁ గొల్వఁగా
నుండఁగ నేను గోటరిక । మో మఱి దాస్యమెంచి సేయుదాననై
యుండెదనో వచింపఁగదె । యో మురమర్దన! యో జనార్దనా!”

—శ్రీకృష్ణ భారతము.

అని కంటఁదడిపెట్టినది. పతులు నపుంసక ప్రాయులనిపల్కి—పాండవుల మనస్సీమలఁ బౌరుష బీజంబునాటి, నిజ శోక ధారల ననలెత్తఁ జేసినది. పరమ యశోధనులును, బాహు బలవిక్రమ సంపన్నులును, నగు పాండవుల పత్ని కింతటి దుర వస్థయా? యని వినువారలకుఁ గూడఁ బౌరుషము జనింపఁజేసినది. తనగతి యేమగునో తెల్పుమని యతిదీనముగ శ్రీకృష్ణ పరమాత్మునిఁ బ్రార్థించి గుండె నీరగు నట్లానర్చినది. అంత నిలువక—

సీ. పిటికి పందలు వోలె । భీమార్జునులు సంధి
మేలని యనిసేయఁ । జాలరేని
నాయన్న దమ్ములు । నాతండ్రియును, నాకొ
మాళ్ళు మార్తురఁ బరి । మార్ప నేర్తు

దను నెత్తిపొడుపు మాటలవలన సంగరరంగ వీరవిహారులగు భీమార్జునుల యుద్ధమునకుఁ బురికొల్పినది. ‘భీమార్జునులులేరు. యుద్ధమింక సేయుటెట్టులా?’ యనిత్రప్రయత్నమును మాన వలదని కృష్ణునకు హెచ్చరికఁ జేసినది. అక్కడనున్న వారలఁ బలుకుములుకులవలనఁ గాయంబునఁ గానరాని గాయంబులఁ గలిగించి బాధించినది. అంతటనేని నూరుకొనక, ధర్మజునిఁ జూచి—

శ్లో. అథక్షమా మేవ నిరస్తవిక్రమ
శ్చిరాయ పర్యేషిసుఖస్యసాధనం

విహాయ లక్ష్మీపతిలక్ష్మ కార్ముకం
జటాధరః సంజ్యాహుధీహ పావకమ్.,

అని పలికి యాతని చిత్తమును సంపూర్ణముగా నొప్పించినది. క్షమయే సుఖమునకు సాధనమగునెడల శస్త్రసన్యాస మొనర్చి, జడలఁదాల్చి తపోవృత్తి నుండుమనినది. తుదకు—

"సస్సనేనుని చేయి। త్రిస్సి నేలంబడి
మాళ్లుబుంగెడు నట్టి। వేళఁ జూచి
గీ. కాని నాడెంద మాఱదు। కలతదీర"

దని తన దృఢాభిప్రాయమును వాక్రుచ్చినది. ఇన్ని విధంబులఁ దాను నిక్కమగు క్షత్రియకాంత యని యఖిల జనంబుల వలనఁ బలికించినది. క్షత్రియకాంత లిట్లుండవలయునని బోధించినది.

## ౬. ద్రౌపది రాజధర్మజ్ఞ.

ద్రౌపది యందుఁ గేవలమొక్క సుక్షత్రియ పౌరుషత్వమే కాక క్షత్రియధర్మజ్ఞత్వమును గానవచ్చుచున్నది. అవ్విధంబున నాఁడు దుశ్శాసనుని వలనఁ బరాభవింపఁ బడి ఖిన్నవదనయైయున్న సమయంబున, ధృతరాష్ట్రుం డామెను

జేరంబిలిచి, యామె యిష్టమెద్దియో తీర్ప నుత్సహించినాఁడ నని పలుక, నామెయు ధర్మంబుఁ దప్పక కురువృద్ధజనలాలితుండై పెరిగిన ప్రతివింధ్యు దాసపుత్రుండని యనకుండుటయుఁ బాండవులు దాస్యమునుండి విముక్తులగుటయుఁ దన యభీష్టమని తెలుప నాతండును నిజవచన ప్రకార మామె కోర్కులఁ దీర్చి యింకేమి కావలయునో తెలుపుమని యడుగుడు, రాజధర్మజ్ఞయగు ద్రోవది——

ఆ.వె. "వైశ్యసతికి నొక్క । వరము సత్క్షత్రియ
సతికి రెండు శూద్ర । సతికి మూఁడు
విప్రసతికి నూఱు । వేఁడఁజ న్వరములు
గాన యింక వేఁడఁ । గాను నాథ."

అని తెలిపినదే కాని ధర్మంబుఁ దప్పి చరింపలేదు. ఇది యట్లుండఁ దొలుత నే రజస్వలయు నేకవస్త్రయునగు నామెను సభకుఁ దోడ్కొని రమ్మని ప్రాతికామినిఁ బంపినప్పు డామె యాతనిని——

తే.గీ. "మున్ను దన్నోటువడి మఱి । నన్ను నోటు
వడియెనో నన్ను మున్నోటు । వడి విభుండు
గ్రన్నఁ దన్నోటు వడియెనో । యన్న నాథు
నెఱుఁగఁ జెప్పుము దీని నీ । వెఱుఁగుదేని."

అని ధర్మసందేహమునుగూర్చి యడిగినది. అతనికిఁ దెలియమి సభను గురువృద్ధుల నడిగినది. అచ్చోటను జవాబు లేదు. తుదకు భీష్ముఁడంతటి వాఁడుగూడ, తదర్థమొక ధర్మజునకే తెలియుననియుఁ, దానెఱుంగఁజాలరనియుఁ దెల్పినాఁడు. ధర్మవిషయమున ద్రౌపది యెంతటివారినేని మించి పోఁగలదు. ఒక్క రాజధర్మమే కాదు. ధర్మతత్త్వమంతయు నామెకుఁ దెలియును. మోహపాశబద్ధుఁడగు కీచకుఁడు దన్నుఁ గోరినప్పుడు మృదువచనంబుల—

తే.గీ. ఆయు రైశ్వర్యకీర్తుల । నపహరించుఁ
బరసతీ సంగమము......

అని యాతనికి ధర్మమార్గమును బోధించినది. తన ధర్మజ్ఞత్వమును బ్రకటించినది.

## ౭. ద్రౌపది శ్రీకృష్ణభక్తురాలు.

ద్వాపరంబున శ్రీకృష్ణునకుంగల యాంతరంగిక భక్తులలో ద్రౌపదీభీష్ము లగ్రస్థానమున నిలిచియున్నారు. ద్రౌపదియొక్క భక్తితత్త్వ మామె మానభంగసమయంబున విశదమగుచున్నది. అట్లు దుశ్శాసనుండు దుర్యోధనచోదితుండై మహాసాధ్వియగు పాంచాలి వలువల నొలువ సమకట్టినప్పు డార్తత్రాణపరాయణుఁడగు నారాయణు నామె

ప్రార్థించినది. కృష్ణయొక్క ప్రార్థనం బాలకించి యాకృష్ణుఁడు దన కామె యొకానొక కాలమున వస్త్రదానం బొనర్చియుం డుటవలన నక్షయంబుగ వలువల నొసంగి నిశ్చలభక్తితత్పరు రాలగు నామెను మానభంగమునుండి కాపాడినాఁడు. శూరా గ్రేసరులగు పాండవులకు, ధర్మాధర్మవిచక్షణశీలురగు కురు వృద్ధులకు, సర్వజనులకు, నలవిగాని యామె మానరక్షణకృత్య మును నామె నిర్మలభక్తియే యొనర్చినది.

శ్రీకృష్ణుఁ డెప్పుడుఁ దన భక్తుల నిగర్వచూడామణు లుగ నొనర్చుచుండును. ద్రౌపదికిఁ బాత్రల శుద్ధిసేయు కార్యమునఁ దన్ను మించినవారలు లేరను గర్వంబు గలదు. పరమభక్తురాలగు నామె కియ్యది లేకుండ నొనర్పవలయునని శ్రీకృష్ణుని సంకల్పము. దూర్వాసుఁడు దుర్యోధన ప్రేరి తుండై యకాలమునఁ దన శిష్యవర్గముతో ధర్మజు నాశ్రమ మున కతిథియై వచ్చెను. సూర్యుఁ డొసంగిన యన్నదాన పాత్ర యొక్కమారెన్ని వేల జనులకేనియు నాహారం బొసంగఁ గలదు. కాని రెండవ పర్యాయమున కయ్యది నిష్ప్రయో జనము. నాఁడద్దాని కృత్యంబు ముగియుటవలన దుర్వాసునకు నాతని శిష్యవర్గమునకు, నన్నమిడుట యసంభవ మయ్యెను. అసంభవమని యూరుకొనిన ముక్కోపి యగు దుర్వాసుఁడు శపించును.అట్టి విషయంబున ధర్మజున కెద్దియుఁ బాలుపో

వమి, గృహిణియగు ద్రౌపదికి సర్వంబు నెఱింగించినాఁడు. కాని యా యమమాత్ర మేమి సేయఁగలదు? ఆమెయు నట్లని యూరుకొనినఁ బాండవులు దుర్వాస శాపోప హతులగు టయుఁ దన గృహిణీత్వము వ్యర్థమగుటయు, సంభవించును. కావున నామె కేమియుఁ దోపమిఁ గృష్ణునిఁ బ్రార్థించినది. ఇప్పుడు కృష్ణునకు భక్తురాలినిఁ గాపాడుటయు, నిందామె గర్వభంగ మొనర్చుటయు, నను రెండు కార్యములు దటస్థించినవి. రెండును జేయవలసినవియే. కావునఁ గృష్ణుఁడు ప్రత్యక్షమై, తానెంతో యాకలివలన బాధపడు చున్నవానివలె నటించి యామెను బట్టెఁడన్నముఁ బెట్టుమని కోరినాఁడు. పాత్రల శుచిత్వమున నామెకుంగల గర్వంబువలనఁ బట్టెడన్నము కాదుగదా! తుదకొక్క మెతుకేనియు నింటిలోపల లేదని యామె పల్కినది. శ్రీకృష్ణ పరమాత్మునకింతయన్నముఁ బెట్ట లేక పోతిని గదా యని యెంతయో నొచ్చుకొనినది. తన జన్మమేల కాల్పనాయని విరక్తిఁ జెందినది. కాని శ్రీకృష్ణుఁడామె మనంబెఱింగియు నెఱుంగని వానివోలె నొక్క మెతుకేనిఁ బాత్రలో నుండదాయని యామె శుద్ధి సేసిన పాత్రను గైకొని తనమాయ వలన నందొక్క మెతుకును గల్పించి, యిదియేనా పాత్ర శుభ్రత్వమని యామెకుఁ జూపి గర్వభంగ మొనర్చినాఁడు. ఆ మెతుకునొక్కదానిఁ దానారగించిసంతుష్టి

నొందినాఁడు. తున్మూలమున దుర్వాసుని, నాతని శిష్యవర్గ మును దృప్తి పఱచినాఁడు. పాండవుల భయముఁ బాపినాఁడు. ద్రౌపదీ గృహిణీత్వమును గాపాడినాఁడు. ఇందును బాంచాలి భక్తి యగపడుచున్నది.

ఇంకను ద్రౌపది శ్రీకృష్ణ భక్తురాలని నిరూపించుటకు భారత యుద్ధమే ప్రబల కారణము. పాంచాలి నెప్పుడు నాతఁడు దన చెలియలగు సుభద్రకన్న నెక్కుడు ప్రేమతోఁ జూచుచుండెడి వాఁడు. అందుఁ గేవల మాంతరంగిక భక్తురాలు.. సత్యభామా ద్వితీయుఁడై శ్రీకృష్ణుఁ డరణ్యంబున నున్న పాండవుల కడకు వచ్చుట, వారలఁ జూచి పోవుటకుఁ గాదు. ద్రౌపది వలన సత్యకుఁ బతివ్రతా ధర్మముల నెఱింగింపఁ జేయుటకే. అదిగాక యాతనికిఁ బ్రథమమునుండియు ద్రౌపదీ పరాభవానలమే కౌరవారణ్యమును గాల్చివేయునని తెలియును. ఆమె పరాభవమునకుఁ బ్రతీకార మొనర్చుటకే యాతఁడు సంధి కుదురనిచ్చినవాఁడు గాఁడు. కృష్ణయెడలఁ బాతివ్రత్యమహిమయు భక్తిమహిమయు సమానముగఁ గలవు.

## ౮. ఉపసంహారము.

ద్రౌపది యామెకుంగల ధర్మాధర్మ వివేకంబు వలనను, బ్రతివింధ్యాదివీరకుమారులం గని వీరమాతృత్వము

నొందుటవలనను, వీరపత్నియు, వీరసహోదరియు, నగుట వలనను, పైని పేర్కొనంబడిన సుగుణవిశేషంబుల వలనను, సర్వలోకంబులకు సర్వకాల సర్వావస్థలయందును బూజనీయ యగుచున్నది. పూజనీయుల చరితంబులు పరమపావనంబు లగుచున్నవి. పావనచరిత్రములు పఠనయోగ్యములును, సకల దురితహారములును నగుచున్నవి. కావునఁ బరమ పతివ్రతామతల్లియు, నిర్మలభక్తిపరతంత్రయునగు ద్రౌపదీదేవి నామసంకీర్తనంబు దురితహారంబగుచున్నది. ఋషుల వాక్యములు సార్థకములగుచున్నవి.

ఇవ్విధంబునఁ గృష్ణ యన్నింటియందు నసమానయై శాశ్వతకీర్తి దిక్తటంబుల వఱకు వ్యాపించునటులఁ బుట్టిన యిల్లును మెట్టిన యిల్లును పావన మొనర్చి మర్త్యాంగనాకులంబున కన్నిటను మార్గదర్శికయై, తన యతులితకీర్తి త్రివిష్టపంబు సర్వంబు నాక్రమించుటవలన దేవాంగనలు విస్మితులై యామె వలనఁ బతివ్రతాధర్మంబుల నెఱుంగఁదలంచి తమ లోకంబునకు రమ్మని ప్రార్థింప నామెయుఁ గాదనఁజాలక వారలతోఁ బుష్పవిమానంబున నాకంబున కేగినది. ధన్యత నొందినది.